# మనవి

ఋగ్వేదకాలంనాటి ఆర్యగాథకు సంబంధించిన విశ్వరథు డనే నవలను క్రిందటినెల ప్రచురించాము. ఈ నెలలో శంబరకన్య నాటకాన్ని ఆంధ్రదేశానికి అందిస్తున్నాము. దేవదత్త, విశ్వామిత్రుడు అనే రెండు నాటకాలతో ఈ కథ పూర్తి అవుతుంది. కొద్దికాలంలో ఆ నాటకాలనుగూడా ప్రచురిస్తాము. తమ పుస్తకాలను అనువాదంచేసి ప్రకటించుకొనడానికి అనుమతించిన గౌరవనీయులైన కె. యం. మున్షీజీకీ, ముఖచిత్రం తయారుచేసి యిచ్చిన సుప్రసిద్ధ చిత్రకారులు వెంబు గారికీ అభివందనాలు.

ఇట్లు,

ప్రకాశకులు.

# శంబరకన్య

సమయం — ఋగ్వేదకాలం

స్థలం — దస్యురాజు శంబరుని దుర్గం

## పాత్రలు

విశ్వరథుడు — గాధిపుత్రుడు

శంబరుడు — దస్యురాజు

ఋక్షుడు — విశ్వరథుని సహాధ్యాయి

తుగ్రుడు — శంబరదుర్గ రక్షకుడు

భైరవుడు — దస్యు పురోహితుడు

అగస్త్యుడు — ఆర్యమహర్షి

ఋచీక భార్గవుడు — భృగువంశీకుడు, విశ్వరథుని బావ

ప్రతర్దనుడు — భరతసేనాపతి

దివోదాస అతిథిగ్వుడు — తృత్సురాజు

ఉగ్రి — శంబరుని కుమార్తె

లోపాముద్ర భారద్వాజీ — భరద్వాజునికుమార్తె, ఋషి.

దాగి — తుగ్రుని భార్య.

దస్యుకన్యలు, భరతయోధులు, దస్యుయోధులు.

# పూర్వగాథ

అనూప దేశం (నేటిగుజరాతు) లో హైహయ వంశానికి సంబంధించిన ఆర్యవీరుడు మాహిష్మంతుడు రాజ్యంచేస్తూ ఉండేవాడు. అతని పురోహితుడు భార్గవవంశ సంజాతుడైన ఋచీకుడు. ఋచీకుడు తేజోవంతుడు. తపశ్శాలి.

ఒకసారి మాహిష్మంతుడు ఆగ్రహావేశంలో ఋచీకుని పరిభవించాడు. అందుకు కుపితుడై ఋచీకుడు మాహిష్మంతుని శపించి, తాను అనూపరాజ్యాన్ని వదలి సరస్వతీనదీతీరంలోని సప్తసింధుకు వెళ్ళిపోయినాడు. భరతరాజు గాధితో అక్కడ ఆయనకు పరిచయం కలిగింది. గాధి కుమార్తె సత్యవతిని వివాహమాడాడు. వీరికి జమదగ్ని అనే కుమారుడు ఉద్భవించాడు. వరుణప్రసాదంవలన సరిగ్గా జమదగ్ని పుట్టిన సమయంలోనే గాధిరాజునకు విశ్వరథుడు ఉద్భవించాడు.

మామా అల్లుళ్ళిద్దరూ కలసి మెలసి తిరిగేవారు. అగస్త్యాశ్రమంలో కలసి విద్యాభ్యాసం చేశారు. బాల్యంలోనే వీరిద్దరూ భరద్వాజుని కుమార్తె లోపాముద్రను తమ యింటిలోనే దర్శించారు. ఆమె అంటే వారికి చాలా అభిమానం కలిగింది.

దివోదాసు తృత్సురాజు. ఆయన కుమారుడు సుదాసు. సుదాసుకూడా అగస్త్యాశ్రమంలోనే విద్యాభ్యాసం చేస్తూ ఉండేవాడు. విశ్వరథు డంటే ఎందుకో కార్పణ్యం వహించి సుదాసు విశ్వరథుని నీళ్ళలో ముంచి చంపి వేయడానికి ప్రయత్నం చేశాడు.

విశ్వరథుని తండ్రి గాధి చనిపోయినాడు. భరతులందరూ విశ్వరథుడు రాజ్యనిర్వహణ చేయవలెనని కోరారు. చదువు

పూర్తిగాక పోవడం వలన విశ్వరథుడు అందుకు అంగీకరించ లేదు.

అగస్త్యుని కుమార్తె రోహిణి. ఆమెను సుదాసున కిచ్చి వివాహం చేయవలెనని అగస్త్యులవారు అనుకొన్నారు. కాని రోహిణి విశ్వరథుని ప్రేమించింది. రోహిణీవిశ్వరథులు కలసి మెలసి ఉండగా చూచి వశిష్ఠుడు వారిని మందలించాడు. అది మొదలు రోహిణి తపస్వినిగా మారిపోయింది

తృత్సురాజు దివోదాసునకూ, దస్యురాజు శంబరునికీ మధ్య తరచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి. అగస్త్యులవారు దస్యురాజును సంహరించవలెనని ప్రతిజ్ఞ చేశారు. లోపాముద్ర దస్యులను కూడా ఆర్యులనుగా చేయవలెననీ, మానవులందరూ సమానులే ననీ భావిస్తూ ఉండేది.

దస్యులు విశ్వరథ ఋషులను శంబరదుర్గంలో బంధించారు. అక్కడ విశ్వరథునికి శంబరుని పరివారంతో పరిచయం కలిగింది. శంబరునికుమార్తె ఉగ్ర విశ్వరథుని ప్రేమించింది. విశ్వరథుడు శంబరకన్యను తన ధర్మపత్నిగా స్వీకరించాడు.

తరువాత కథ శంబరకన్య నాటకంతో ప్రారంభమవుతుంది.



# శంబరకన్య

## మొదటి దృశ్యం

(సాయం సమయం. సూర్యుడు అస్తమిస్తున్నాడు. దస్యురాజు శంబరుని కోట. ఎడమవైపుగా ఉన్న, కొబ్బరి ఆకులతో నిర్మించబడిన కుటీరం మీద పెద్దచెట్టునీడ పడుతున్నది. వెనకగా అలాంటివే రెండు కుటీరాలు కనపడుతున్నవి. అక్కడక్కడ పెద్ద పెద్ద చెట్లున్నవి.

ఒక చెట్టుక్రింద విశ్వరథుడు కూర్చొని ఉన్నాడు. అతని శరీరకాంతి స్ఫటికంలాగా స్వచ్ఛంగా ఉన్నది. అతని ముఖంమీద దైవకాంతి విరాజిల్లుతూ ఉన్నది. మృగచర్మం ధరించి ఉన్నాడు. విచారగ్రస్తంగా కనపడుతున్నాడు. వెనక తెరలోనుండి ఈ. ఈ. ఈ. ఈ. ఊ. అనే సంగీతమూ, నృత్యం చేసేవారి కాలి గజ్జెల ధ్వనులూ వినపడుతున్నవి. ఆ శబ్దం నెమ్మదిగా తగ్గిపోతుంది. తెర లేస్తుంది.)

విశ్వరథుడు

(నెమ్మదిగా దుఃఖపూరిత స్వరంతో) మఘవన్! మఘవన్! ఇలా చేశావేమి? (వెనకనుండి మరల సంగీతం వినపడుతుంది)

ఉగ్ర

(ప్రవేశిస్తుంది) కౌశికా! కౌశికా! లే. వెళ్ళుదాం. నాన్నగారు వచ్చి ఎంతోసేపయింది! (విశ్వరథుని చింతా

క్రాంతమైన ముఖం వంకచూచి ఉలిక్కిపడుతుంది. వెళ్లి విశ్వరథుని భుజంమీద చేయి వేస్తుంది. ఆ మొముఖంలోనికి గూడా విషాదం ప్రవేశిస్తుంది) ఏమిటిది? ఈ కన్నీళ్లేమిటి? నలుమూలలా ఉత్సవధ్వనులతో కోట ప్రతిధ్వనిస్తూ ఉంటే ఆనందించటం మాని ఇక్కడ కూర్చొని కన్నీళ్లు కారుస్తున్నావా?

విశ్వరథుడు

(కన్నీటిని తుడుచుకుని ఉగ్రవైపు దీనభావంగా చూస్తాడు) ఉగ్రా! నన్ను ఆనందించమంటున్నావా? ఏ ముఖం పెట్టుకొని ఆనందించను చెప్పు? ఈ జరుగుతున్న ఉత్సవ మేమిటి? నాకు పితృతుల్యులైన అగస్త్యులవారి పరాజయోత్సవంకాదూ? మీ దస్యులు ఈ రోజు ఆనందిస్తూ ఉంటే మా భరతగ్రామంలో ఎంతమంది దుఃఖిస్తూ ఉంటారో ఆలోచించావా? శాంబరీ! వెళ్లు, నీ తండ్రికి జయం కలిగిందిగనుక నీకు ఆనందం.

ఉగ్ర

అయితే నీవు రావా? కోటలోని స్త్రీ పురుషు లందరూ మా నాన్నగారికి స్వాగతం చెప్పడానికి సిద్ధంగా ఉంటే ఆ ఉత్సవంలో మనం పాల్గొనవద్దా?

విశ్వరథుడు

నన్ను ఎవరి స్వాగతోత్సవంలో పాల్గొనడానికి రమ్మంటావు? నేను తప్పించుకొని పోకుండా ఈ కారాగారపు గొలుసులు ఇంకా దృఢపడినవి. ఆ స్థితిలో నే నెలా స్వాగతోత్సవంలో పాల్గొనను? శాంబరీ! నీవు వెళ్లు.

ఉగ్ర

(ఖేదంగా) అయితే ఇక్కడ ఒక్కడవే ఏమిచేస్తావు నీవు ?

విశ్వరథుడు

నేనా ? ఎవ్వరూ నన్ను చూడని స్థలానికి వెళ్ళిపోతాను. తల బద్దలు కొట్టుకొని మరణించడం తప్ప నా కింకొక గత్యం తర మేమీ లేదు. శాంబరీ ! నన్ను వదలు. (కొంచెంసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉంటారు. విశ్వరథుడు కన్నీరు తుడుచు కొంటాడు. శాంబరి అతని శిరస్సును ఆప్యాయంగా చేతితో నిమురుతుంది) వరుణదేవా ! యుద్ధక్షేత్రంలో యుద్ధం చేస్తూ చేస్తూ నేను మరణిస్తే ఎంత బాగుండేది ?

ఉగ్ర

ఇంత విచార మెందుకు ? వద్దంటే నేనుగూడా వెళ్ళడం మానివేస్తాను. కాని, నేను కంటికి కనపడకపోతే మా నాన్నగారి ఉత్సాహ మంతా తగ్గిపోతుంది.

విశ్వరథుడు

అదేమిటి ? నీవు తప్పకుండా వెళ్లు. ఆనందించు. (కొంచెంసేపు ఆగి) శాంబరీ ! నాకు కలిగిన విచారభావాన్ని అర్థం చేసుకోలేని దానివి నాకు సహధర్మచారిణివి ఎలా అవు తావు ?

ఉగ్ర

(దీనభావంతో) కౌశికా ! నే నున్న స్థితిలో మీా గౌరాంగి ఎవరైనా ఉంటే ఏమి చేస్తుందో చెప్పు? నీవూ, నాన్న

గారూ ఇద్దరూ ఆనందించే ఉపాయం ఏదైనా చెప్పు. ఈ ఇద్దరిలో ఎవరు విషాదంగా కనిపించినా చూచి నేను భరించలేను.

విశ్వరథుడు

(ఖేదంగా; నీవు ఆర్యగృహిణివి అయితే ఈనాడు ఈ స్థితిలో నీ తండిని మరచిపోయేదానివి. నీ శరీరంలోని ప్రతి అణువూ నా శరీరంలోని ప్రతి అణువుతో పెనవేసుకొని నాట్యం చేసేవి. (దీర్ఘంగా నిట్టూర్చి) కాని ఈ మాటలు నీకు అర్థంకావు.

ఉగ్రి

(శంబరి హృదయానికి పెద్ద దెబ్బ తగిలి నట్లవుతుంది.) కౌశికా! నన్ను ఏమిచేయమంటావో చెప్పు. నీవు ఏది చెప్పితే అదే చేయడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటున్నాను. ఇంకా నన్నేమి చేయమంటావు? ఎప్పుడూ ఇలాగే దుఃఖంగా ఉంటున్నావు!! నాకేమీ తోచడంలేదు.

విశ్వరథుడు

(లేచి ఉగ్రిను ఆలింగనం చేసుకొంటాడు) ఉగ్రీ! నీవు చూపించే భక్తీ, నీవు చేసే సేవా ప్రశంసాపాత్రాలు. నన్ను క్షమించు. ఏమయినా నీవు రాజకన్యకవు, నేను ఖైదీని!! నీవు దస్యు కన్యకవు, నేను భరతుణ్ణి. మన కిద్దరికీ సమన్వయం కుదిరే దెలా? సరే, నీవు వెళ్ళు. నీ తండ్రి...

(లోపలనుండి సంగీతం వినపడుతుంది. ఇద్దరు దస్యుకన్యకలూ ఋక్షుడూ ప్రవేశిస్తారు. ఋక్షుడు ద్వంద్వ శరీరం కలవాడు. పెద్ద పొట్ట ఉన్నది. ఆర్యుడు. కాని దస్యులవలె లంగోటీ బిగించి తాటిఆకుల లంగాను ధరించి

ఉన్నాడు. కాళ్లకు గజ్జె లున్నవి. వీపుమీద ఢోలక్ ఉన్నది తలమీద నెమలిపింఛం ధరించి ఉన్నాడు. బాగా తాగి ఉన్నాడు. దస్యుకన్యకలు శ్యామలవర్ణంగా ఉన్నారు. అంతా నాట్యం చేస్తున్నారు. ఈ ఈ ఈ అని సంగీతం పాడుతున్నారు.)

ఋ ష్య డు

(తూలుతూ) కౌశికా! పద. కోటలోని జనమంతా బయట గుమిగూడి ఉన్నారు. నీ విక్కడ ఏమి చేస్తున్నావు?

(ఋష్యుని చూడగానే విశ్వరథునికి చాలా కోపం వస్తుంది. ఋష్యుని చెవి పట్టుకొంటాడు. ఋష్యుడు మూలుగుతూ తప్పించుకొని అవతలకు పోతాడు.)

వి శ్వ ర థు డు

ఋష్యా! నీ కేమి పుట్టింది? అసలు ఎక్కడ ఉన్నావో ఏమి చేస్తున్నావో తెలుస్తున్నదా!

ఋ ష్య డు

(చెవి సర్దుకుంటూ) ఎక్కడ సంగీత ముంటే అక్కడ నే నుంటాను.

వి శ్వ ర థు డు

(పళ్లుకొరికి) గురువుగారి పరాజయానికి ఆనందోత్సవం జరుపుతున్నా వన్నమాట. అవునా?

ఋ ష్య డు

భరతశ్రేష్ఠా! పరాజయంలో గూడా ధైర్యం కోల్పోకుండా ఉండడం వీరుల లక్షణం. దుఃఖ లోగూడా సుఖాన్ని అనుభవించడమే తపోనిధుల తపస్సుకు ఫలితం.

విశ్వరథుడు

ఋషీ! నీవు మైత్రావరుణుల పేరును అపవిత్రం చేస్తున్నావు. తృత్సుజాతి గౌరవాన్ని మంటగలుపు తున్నావు. ఈ వేష మేమిటి? ఈ ఆటపాట లేమిటి? సిగ్గులేదా? నాతో రా. కుటీరంలోనికి వెళ్ళి పోదాం (చెయ్యి బట్టుకొని లాగుతాడు)

ఋషుడు

(చెయ్యి విడిపించుకుని) కౌశికా! కన్నీటిని ప్రవహింప జేయగలిగిన శక్తి కలిగినప్పుడు నేనుకూడా నీతోబాటు కుటీ రంలో చేరుతాను. అంతవరకూ నన్ను వదలిపెట్టు. ఈ. ఈ. ఈ. ఈ.

(దస్యుకన్యలతో) పదండి. పోదాం. (దస్యుకన్యల భుజాలమీద చేతులు వేసి వెళ్ళి పోతాడు)

విశ్వరథుడు

దేవాధిదేవా! (దీర్ఘంగా నిట్టూరుస్తాడు)

ఉగ్ర

కౌశికా! ఈ దీర్ఘ నిశ్వాసా లేమిటి? కాళ్ళమీద పడ తాను. నీకు ఇష్టం లేని పనిని నేను చేయను. ఒక్కసారి నవ్వు; నీ నవ్వుముఖం చూడనిది నేను బ్రతుకలేను.

విశ్వరథుడు

(తడసిన కళ్ళతో) శాంబరీ! నీవు రాజకన్యవు. ఒక ఖైదీకోరకై ఎందు కింతగా కష్టపడతావు? నేను ప్రస్తుతం నిన్ను సుఖపెడుతున్న దేమున్నది? భవిష్యత్తులోకూడా నిన్ను సుఖపెట్టలేను.

ఉగ్ర

(కన్నీరు బొటబొట కారుస్తుంది) నీ చరణసేవ తప్ప నా కింకేమీ వద్దు. (కన్నీరు తుడుచుకొంటుంది.)

విశ్వరథుడు

దేవా! అనార్యులలో ఈ సాంఖ్య భావమేమి! ఉగ్రా! లే. దుఃఖించకు, పద. అక్కడ కూర్చుందాము. (ఇద్దరూ వెళ్ళిపోతారు)

(సంగీతం వినవస్తున్నది మృదంగాలు మోగుతున్నవి. శంబరుడూ, తుగ్రుడూ, ఇంకా ఇద్దరు దస్యులూ ప్రవేశిస్తారు. శంబరుడు పొడగరి. బలశాలి. వృద్ధుడు. అతని శిరోజాలు తెల్లగానూ పొడవుగానూ ఉన్నవి తెల్లటి మీసాలు తళతళా మెరుస్తున్నవి. రంగుగుడ్డ ధరించి ఉన్నాడు. శరీరము తటా ఇనపకవచాలు కట్టి ఉన్నవి.

తుగ్రుడు కూడా వృద్ధుడైనా మంచి బలశాలి. దాదాపుగా తుగ్రునివేష కూడా శంబరునివేషంలాగానే ఉన్నది. అతని నడుముకు ఒక కత్తి వ్రేలాడుతూ ఉన్నది. ఋక్షుడు ఒక మూలకు వొదిగాడు. శంబరుడు తుగ్రునితో మాట్లాడుతున్నాడు.)

శంబరుడు

తుగ్రా! అగస్త్యుని బాగా మోసపుచ్చాము. అతణ్ణి బంధించి తీసుకొని వద్దామనుకొన్నాను, కాని తప్పించుకొన్నాడు.

(చేతితో కంఠం పిసికిన అభినయం చేసాడు)

(నేపథ్యంలో దస్యులు ఈ ఈ ఈ ఊ ఈ ఈ ఈ ఊ) సంగీతం పాడతారు.

శంబరుడు

ఉగ్ర ఏది ? ఇక్కడకూడా లేదే ?

తుగ్రుడు

"ఉగ్రా !" (పెద్దగా పిలుస్తాడు)

ఋక్షుడు

కౌశికునితో కలసి తిరుగుతూ ఉంటుంది.

శంబరుడు

కౌశికునితోనా ?

తుగ్రుడు

అవును, ప్రభూ ! మనం పొరబాటు పడ్డాము. ఇతడు ఋక్షుడు.

రెండో అతనిపేరు కౌశికుడు. అతడే అథర్వాణుని బావమరది. ఉగ్రి కౌశికుని వరించింది.

శంబరుడు

వరించిందా ? బాగున్నది. (పెద్దగా నవ్వుతాడు) ఈ పొరపాటు ఎలా జరిగింది ?

ఋక్షుడు

దస్యునాథా ! కౌశికుడు ఈ రోజు చాలా విచారంగా ఉన్నాడు.

శంబరుడు

(పెద్దగా నవ్వుతూ) అవును. ఈ రోజు మీరు విచారించవలసిన రోజే. (ఋక్షునితో) పోయి కౌశికుని పిలుచుకొని రా. నా పరాక్రమగాథను అతనికి వినిపించాలి.

తుగ్రుడు

ఋషీ! కౌశికుడు అక్కడ కూర్చొని ఉంటాడు. పిలుచుకొని రా. (ఋషుడు వెళ్ళిపోతాడు) ప్రభూ! మీ ఆరోగ్యం బాగున్నదా?

శంబరుడు

(గర్వంగా) తుగ్రా! ఉగ్రికాలుడు వేయిమంది పురుషుల బలాన్ని నాకు ప్రసాదించాడు. యుద్ధంలో పెద్ద దెబ్బ తగిలినా రెండురోజులలో ఆ దెబ్బ నయమయి పోయింది. ఇక్కడ అంతా కులాసాగా ఉన్నారా?

తుగ్రుడు

అంతా కులాసాగానే ఉన్నారు. ఉగ్రమాత్రం చాలా జబ్బుపడింది.

శంబరుడు

ఏమి జబ్బు! ఇప్పుడు కులాసాగా ఉన్నదా?

తుగ్రుడు

ఆ. కులాసాగానే ఉన్నది.

శంబరుడు

నాకు తెలియనే లేదే! తెలిస్తే భైరవుణ్ణి పంపేవాణ్ణి.

తుగ్రుడు

కౌశికుడు మంత్రాలద్వారా ఉగ్రిను రక్షించాడు. అసలు బ్రతకదనే అనుకొన్నాము.

(కాళ్ళ ధ్వని వినపడుతుంది.)

శంబరుడు

మా ఉగ్రి వచ్చింది. ఉగ్రీ! (ఉగ్ర పరుగెత్తుకుంటూ వచ్చి తండ్రిని ఆలింగనం చేసుకొంటుంది. శంబరుడు ఆమె శిరస్సును ఆఘ్రాణిస్తాడు.) ఉగ్రీ! ఉగ్రీ! ఎక్కడున్నావమ్మా ఇంతసేపూ? (విశ్వరథుడు నెమ్మదిగా వచ్చి నిలబడతాడు) ఓహో కౌశికుడవా! ఏమి అలా ఉన్నావు? నీవు అథర్వణుని బావమరదివట. ఇన్నిరోజులూ చెప్పలేదేమి? ఇప్పుడే తుగ్రుడు చెప్పాడు.

విశ్వరథుడు

మీ రా విషయం అడిగిం దెప్పుడు?

శంబరుడు

(ఉగ్రను వీపు నిమురుతూ) అమ్మా! నీవు మంచిపని చేశావు. విశ్వరథుని వరించి గొప్ప పని చేశావు.

తుగ్రుడు

(నవ్వి) ఆడపిల్లలు ఇలాంటివిషయాలలో మహా చతురురాళ్ళుగా ఉంటారు.

ఉగ్ర

కౌశికుడు ఎంతో విచారంగా ఉంటే ఆయన దగ్గర కూర్చున్నాను.

శంబరుడు

విచారంగా ఉండదూ? కౌశికా! నీ గురువును ఓడించి వేశాను బంధించి తీసుకొని వద్దామను కొన్నాను. కాని చివరకు తప్పించుకున్నాడు. మీ గురువుగొంతు నులిమి

మా దస్యుల నందరినీ విడిపించుకొంటాను. (నవ్వి) మీ ఆర్యుల్ని ఎంతమందిని బంధించి తీసుకొని వచ్చానో చూస్తావా ?

విశ్వరథుడు

దేవతలు మాకు వ్యతిరేకంగా ఉన్నారు. బాధించిన వారిని ఇక్కడకు తీసుకొని వచ్చారా ?

శంబరుడు

(నవ్వి) వొంటరిగా నీ కేమీ తోచడం లేదా ? నేను అందరినీ వేరు వేరు నగరాలకు పంపించాను. మా దస్యులచేత మీరు ఎలా సేవ జేయించుకుంటున్నారో నేను కూడా అలాగే మీ ఆర్యులచేత సేవ జేయించుకొంటాను. నీకొరకు ఒక్క ఖైదీనిమాత్రం తీసుకొని వచ్చాను.

విశ్వరథుడు

ఎవరా ఖైదీ ?

శంబరుడు

తుంగా! ఆ ఖైదీకిగాను కౌశికుని కుటీరానికి ప్రక్కనున్న కుటీరంలో నివాసం ఏర్పాటుచెయ్యి. (నవ్వి, విశ్వరథునితో) ఆ ఖైదీ ఎవ్వరంటున్నావా? ఉండు. ఇప్పుడే కబురంపుతాను. ఉగ్రీ! (ఉగ్రను దగ్గరకు లాగుకొని) నవ్వవేం ? అట్లా ఉన్నావేం ?

ఉగ్ర

ఏమీ లేదు. అన్న భేదుడేడీ ?

శంబరుడు

భేదుడు మరణించాడు. మిగతా అన్నలు ఖైదీలతో వేరువేరు కోటలకు పంపబడ్డారు.

ఉగ్ర

(దుఃఖంగా) భేదుడు మరణించాడా? ఏదో అరిష్టం జరుగుతుం దని అనుకొంటూనే ఉన్నాను. (కన్నీరు తుడుచుకొంటుంది)

శంబరుడు

అమ్మా! దుఃఖించకు. ఎంతోమంది ఆర్యులను ఉగ్రకాలునికి బలియిచ్చిన తరువాతగాని భేదుడు మరణించలేదు. అమ్మా! దుఃఖించకు. భేదుడు వీరమరణం పొందినాడు. (ప్రక్కకుచూచి) ఎవరు? భైరవా!

భైరవుడు

(నేపథ్యంలో) ఈ – ఈ – ఈ ఊ.

ఉగ్ర

అవును. భైరవుడే.

(భైరవుడు ప్రవేశిస్తాడు. ముప్పయిసంవత్సరాల వయస్సు ఉంటుంది. శరీరమంతటా భస్మంపూసుకొనిఉన్నాడు. కళ్ళకు అంజన మున్నది. చేతిలో రక్తరంజితమైన త్రిశూల మున్నది. కాళ్ళకు గజ్జెలు కట్టి ఉన్నవి.)

శంబరుడు

భైరవా! లోపా ఎక్కడ?

విశ్వరథుడు

(ఉలిక్కిపడి) లోపా!

భైరవుడు

ఆమె బంధనాలు ఊడదీయబడినవి. ఆమె ఇప్పుడే ఇక్కడకు తీసుకొని రాబడుతుంది.

శంబరుడు

ఆమెను ఎందుకు బంధించారు ?

భైరవుడు

(వెకిలిగా నవ్వి) అనవసరంగా నా నెత్తిమీదకు ప్రమాదం తెచ్చుకొంటానా ?

శంబరుడు

ఆమెను బంధించ వద్దన్నాను ?

భైరవుడు

బంధించమని ఉగ్రకాలుడు ఆజ్ఞాపించాడు. ఇంత అందమైన ఖైదీ ఉగ్రకాలునికి యిదివర కెప్పుడూ లభించి ఉండలేదు.

శంబరుడు

(ముందుకు సాగి) లోపాముద్రా! ఇటు రా.

(లోపాముద్ర ప్రవేశిస్తుంది. ముప్పై ఏసంవత్సరాల వయస్సు ఉంటుంది. అందమైన శరీరం.సూర్యకాంతిలో ఆమె తళతళ లాడుతున్నది. ఆమె కళ్లు చూపరులను ముగ్ధులను చేస్తున్నవి. ఆమె ఆర్యస్త్రీవేషాన్ని ధరించి ఉన్నది. నీవీయుక్తమైన ఒక అధోవస్త్రాన్ని ధరించి ఉన్నది. పైన ఉన్ని ఉత్తరీయం మున్నది. ఆమె మెడలో రుద్రాక్షమాలలున్నవి. చేతిలో కమండల మున్నది) లోపాముద్రా! నా దుర్గాన్ని పవిత్రం చేయి.

లోపాముద్ర

(నవ్వుతూ) శంబరా! నీ కోరిక పూర్తి అయిందా ?

(శంబరుడు నవ్వుతాడు)

విశ్వరథుడు

(సాష్టాంగ నమస్కారం చేసి) భగవతీ! నమస్కారం.

లోపాముద్ర

(చేతులు జాపి) పుత్రకా! శతంజీవివి కమ్ము. (గుర్తించి) ఎవరు, విశ్వరథుడా! భగవత్ శ్రేష్ఠా! నీవు కూడా ఇక్కడే ఉన్నావా? (రెండు చేతులతో అతనిని లేవనెత్తి శిరస్సును ఆఘ్రాణిస్తుంది). వత్సా! ఎన్నిరోజులనుండీ ఈ దుర్గంలో ఉన్నావు?

విశ్వరథుడు

ఏడునెల లయినది. భగవతీ! మీరెలా ఖైదు చేయబడ్డారు?

లోపాముద్ర

నేను పురుకుత్సుని పట్టణాన్నుండి శతద్రుజల మార్గంలో నావమీద ప్రయాణం చేస్తూ ఉన్నాను. అగస్త్యులవారికి దెబ్బతగిలిందని తెలిసి వారిని చూడడానికి దిగాను. శంబరుడు నన్ను బంధించాడు. (శంబరునితో) నీ వైరం తీరినట్లేనా?

శంబరుడు

(గర్వంతో) వైరమా? నేను వైరం తీర్చుకోడానికి నిన్ను బంధించలేదు ఎన్నో సంవత్సరాలనుండి నిన్ను చూడవలెనని ఆరాటపడ్డాను అందువలన.........

లోపాముద్ర

(నవ్వి) అవునవును. ఎవరినిబడితే వారిని బంధించగలనని ఆర్యులకు నీ పరాక్రమాన్ని తెలియజెప్పదామనుకొన్నావు. అవునా? కౌశికా! నీ ఉద్దేశ్యం ఏమిటి?

ఉగ్రి

(విశ్వరథుని చేయిపట్టుకొని) పద, మనం వెళ్ళిపోదాం.

విశ్వరథుడు

ఉండు.

శంబరుడు

(వినయంగా) నా ప్రాణాలను రక్షించిననాటినుండీ నిన్ను నా కోటలోనికి ఒక్కనారి తీసుకొని రావలెనని నా మనస్సు ఉవ్విళ్ళూరింది.

లోపాముద్ర

కాని, దస్యురాజా! నన్ను బంధించి నీవు చాలా పాప కృత్యం చేశావు. వెనుకటి అరవై సంవత్సరాలలో ఎప్పుడూ దేవతలు ఇంతగా కోపగించే పనిని దేనినీ నీవు చేసి ఉండవు.

భైరవుడు

(భయంకరంగా నవ్వి) ఉగ్రకాలుడు ఈ రోజు చాలా ఆనందంగా ఉన్నాడు.

లోపాముద్ర

శంబరా! దేవతలు నిన్ను క్షమించరు.

శంబరుడు

లోపాముద్రా! నీకు ఏ విధమైన కష్టమూ కలిగించను.

లోపాముద్ర

నాకు కష్టం కలిగిస్తావని భయంలేదు. నీ స్థితి ముందు ఏమి కానున్నదా అని ఆలోచిస్తున్నాను

భైరవుడు

ఉగ్రకాలుని దయ ఉన్నంతకాలమూ ఎవరికీ భయపడ నక్కర్లేదు.

శంబరుడు

నిజం. నా పశుపతి నాతో ఉన్నంతకాలమూ నన్ను ఎవ్వరూ ఏమీ చేయలేరు. నీ దేవతలుగానీ, మా దేవతలు గానీ కోపగించే పనిని నేను ఏమిచేశాను ?

విశ్వరథుడు

(కోపంతో) దస్యుపతీ! దేవతలకు ఇష్టురాలైన భరద్వాజునిపుత్రికను అవమానపరిచావు. నీవు చేసిన ఈ అకృత్యాన్ని చూచి దేవతలు సహిస్తారా ?

లోపాముద్ర

(నవ్వి) ఇంద్రుడు నీకు మేలు చేకూర్చుగాత అని నా కోరిక. కౌశికా! మహా అథర్వణులను కొద్దిరోజులక్రితం దర్శించాను.

ఉగ్రి

(విశ్వరథుని చేయి లాగి) పద, పోదాం.
(విశ్వరథుడు వినిపించుకోడు)

లోపాముద్ర

(నవ్వి) ఈమె ఎవరు ? కౌశికా! ఈ అమ్మాయి నిన్ను పిలుస్తున్నది.

(విశ్వరథుడు దుఃఖంగా నిలబడి ఉంటాడు)

శంబరుడు

ఈమె నా కుమార్తె ఉగ్రి. విశ్వరథుని వరించింది.

లోపాముద్ర

బాగున్నది. మంచిసంబంధం! శంబరా! సప్తసింధులో విశ్వరథునితో సమానుడైన పురుషుడు నీ కెక్కడా దొర

కడు. (ఉగ్రతో) సోదరీ! ఇలా రా.

(ఉగ్ర కోపంగా చూస్తుంది. దగ్గరకు పోదు)

శంబరుడు

ఉగ్రా! దగ్గరకు వెళ్ళి లోపాముద్ర పాదాలకు నమస్కరించు. (ఉగ్ర కోపంగానే లోపాముద్రను వంగి నమస్కారం చేస్తుంది. లోపాముద్ర ఆమెను పైకి లేవదీస్తుంది)

లోపాముద్ర

సోదరీ! విశ్వరథునికి తగిన భార్యవు కావాలి. మాట్లాడవేం?

ఉగ్ర

(కోపంతో) మీరు నా విశ్వరథునితో అలా మాట్లాడుతారేం?

(అందరూ నవ్వుతారు)

లోపాముద్ర

(నవ్వుతుంది. ఆమె నవ్వు తరంగాలలాగా నలువైపులా వ్యాపిస్తుంది) అందుకేనా ఇంత కోపం? ఈ విశ్వరథుని బాల్యం నుండీ నే నెరుగుదును. విశ్వరథా! సరస్వతీనదీతీరంలో... జ్ఞాపక మున్నదా?

విశ్వరథుడు

(చింతితస్వరంతో) జ్ఞాపకం లేకేం? ఆనాటి స్వప్నంలో నుండి నేటివరకూ నేను మేలుకోలేదు. కాని ఇప్పుడు ఆ విషయాలన్నీ జ్ఞాపకం చేయవద్దు. ఈ దస్యురాజు నన్ను మనుష్యత్వంలోనుండి పశుత్వంలోనికి దింపివేశాడు.

శంబరుడు

(నవ్వి) పశుత్వంలోనికి దింపివేశానా? నీకు ఏమి

లోటు చేశాను. నాకు మిగిలినది, నా జీవితసర్వస్వం ఈ ఉగ్రి. ఈమెనుగూడా నీవు కాజేశావు. (ఉగ్రవీపుమీద చేయి వేస్తాడు)

విశ్వరథుడు

అవును మంచి భోజనం చేశాను, తియ్యని నీటిని తాగాను బాగా నిద్రపోయినాను. శంబరిగూడా నన్ను పూర్తిగా బంధించివేసింది. అంతా బాగానే ఉన్నది. కాని నేను బందెదొడ్డిలో ఉన్న పశువులాగానే ఉన్నాను. భరతుల సంపర్కంలేక కృశించి పోతున్నాను. దేవతలను ఆహ్వానించి యుద్ధంలో వీరగతిని పొందే అధికారంగూడా నాకు లేకుండా జేశావు.

శంబరుడు

(నవ్వి) విచిత్రమైన యువకుడు!! అమ్మా! ఉగ్రి! నీ కితను ఎలా నచ్చాడు!

లోపాముద్ర

భరతుల పటుత్వంగలిగిన వాగ్దేవి ఇతని ముఖంలో తాండవిస్తున్నది

భైరవుడు

(కటువుగా) దస్యురాజా! పూజకు వేళయినది. ఉగ్రకాలుని మందిరానికి పోవాలి.

శంబరుడు

అవును. విశ్వరథా! లోపాముద్ర నీతోబాటుగా ఉంటుంది. తుగ్రుడు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాడు.

భైరవుడు

దస్యురాజా! ఈమెను ఉగ్రకాలుని మందిరంలోనికి తీసుకొని పోవాలి.

లోపాముద్ర

నేను విశ్వరథునితోనే ఉంటాను. (విశ్వరథుని భుజం మీద చేయివేసి) పోదాం పద కౌశికా!

విశ్వరథుడు

భగవతిఆజ్ఞ శిరోధార్యం.

భైరవుడు

నేనూ వస్తున్నాను. ఏర్పాట్లన్నీ చేయిస్తాను.

విశ్వరథుడు

నీ యిష్టం. భగవతీ! దయచేయి.

(లోపాముద్ర విశ్వరథునిభుజంమీద చేయివేసి వెళ్ళి పోతుంది. ఆమె వెనుక భైరవుడు వెళ్లుతాడు. ఖిన్నవదనయైన ఉగ్రను చూచి శంబరుడు ఆమెగడ్డం పట్టుకొంటాడు.)

శంబరుడు

అమ్మా! అంతకోపం వచ్చిందేమి? (ఉగ్రముఖం ముడుచుకొంటుంది.)

ఉగ్ర

నాన్నగారూ! ఈ గౌరాంగిని ఇక్కడ కెందుకు తీసుకొని వచ్చారు?

శంబరుడు

ఏమి? ఆమె నీకు నచ్చలేదా? మనమంటే ఆమెకు చాలా ప్రేమ.

ఉగ్ర

ప్రేమా! నాన్నగారూ! నన్ను హత్యజేశారు.

శంబరుడు

ఏమమ్మా అలా అంటావేం?

ఉగ్ర

ఈమె నా కౌశికుణ్ణి కాజేసింది. (కళ్లు తుడుచుకుంటుంది)

శంబరుడు

పిచ్చి ఎత్తిందా? ఉగ్రమనస్సును ఎవరు నొప్పించగలరు? పద, పోదాం.

ఉగ్ర

ఆ సంగతి నాకూ తెలుసును.

(భైరవుడు తిరిగి వస్తాడు)

భైరవుడు

దస్యునాథా! ఈ యువకుణ్ణి మీరు మరీ నెత్తిమీద కెక్కించుకొంటున్నారు.

శంబరుడు

విశ్వరథుణ్ణేనా?

ఉగ్ర

ఏమి? ఏం జరిగింది?

భైరవుడు

తన నోటికి వచ్చినట్లుగా మాట్లాడుతున్నాడు, తనకు తోచినట్లుగా పనులు చేస్తున్నాడు.

ఉగ్ర

అయితే ఏమి ?

భైరవుడు

లోపాముద్ర తనది అన్నటుగా మాట్లాడుతున్నాడు. మీరుగూడా వాళ్ళకు సంపూర్ణంగా స్వేచ్ఛ నిస్తున్నారు.

శంబరుడు

భైరవా! ఇంకా నీకు చిన్నతనం వదలలేదు. లోపాముద్ర ఆర్యదేవతల పుత్రిక.

శంబరుడు

మనం ఆమెను బంధించి తీసుకొని రాలేదా ? ఆమెను నా కళ్ళముందు అట్టిపెట్టాలి.

ఉగ్ర

ఆమెను నీ దగ్గరనే, నీ కళ్లముందే అట్టిపెట్టుకో. ఎవరు కాదన్నారు ?

భైరవుడు

నేనూ అదే ఆలోచిస్తూఉంటే దస్యురాజు మధ్యలో కలిగించుకొని ఇంకొకవిధంగా చేశారు.

శంబరుడు

నీవు ఆమెను తీసుకొని పోయేవాడవే !! (గంభీరంగా) నేను న[illegible]స్సులో నీ క[illegible]టే పెద్దవాణ్ణి [illegible] తెలిపించా ? ఆమెను బంధ[illegible] తెచ్చిన నా[illegible] నా స్వసమే [illegible]కు ఉ[illegible] ఎంతో ఆమె అ[illegible]తి.

ఉగ్ర

(ఎగతాళిగా) అయితే ఆమె అంటే మీకుగూడా అంత ఆదరభావం ఉన్నదన్నమాట !

శంబరుడు

అవును. ఆమె అంటే నాకెంతో గౌరవం. ఆమె నాకు సేవ చేయకపోతే ఈనాడు నేను జీవించిఉండేవాణ్ణే కాను. నీకు తెలియదు. నేను గాయపడి అడవిలో పడి ఉంటే ఈమె నన్ను అథర్వణుని ఆశ్రమంలోనికి తీసుకొనిపోయి నాకు ప్రాణదానం చేసింది. ఆనాడు ఇంకొక గౌరాంగుని కంట నేను పడి ఉన్నట్లయితే నన్ను అతడు ఏమిచేసి ఉండేవాడో! భైరవా! ఆమె నా కుమార్తెతో సమానం. ఈ విషయం మరచిపోకు.

భైరవుడు

కాని ఆ విశ్వరథుడు ?

ఉగ్ర

అతడు నాభర్త. ఈ విషయం మరచిపోకు.

శంబరుడు

(ఇద్దరి భుజాలు తట్టి) వారిద్దరూ నా అతిథులు. ఈ విషయం మీరిద్దరూ మరవవద్దు.

భైరవుడు

(తల ఆడించి) కాని దస్యురాజా! రేపు ఉగ్రకాలుడు వారినిద్దరినీ స్మరిస్తే ?

శంబరుడు

(ఉలిక్కిపడి) ఏమిటి ?

ఉగ్ర

(వెలవెల పోతుంది.)

ఓహ్ !

తెర పడుతుంది.

---

# రెండో దృశ్యం

(అదే స్థానం : రాత్రి మొదటి ఘడియలు. కొంచెం దూరంలో అగ్ని వెలుగుతున్నది. ఆ అగ్నికి కుడివైపున లోపాముద్ర మోకాళ్ళమీద కూర్చొని అగ్నివంక చూస్తున్నది. ఒక ప్రక్క ఋక్షుడు కూర్చునివున్నాడు. ఉండి ఉండి ఆమె ఋక్షునివంక చూస్తున్నది ఇంకా శాలువ కప్పుకో లేదు. దగ్గరనే కమండల మున్నది. ఎడమవైపున మృగచర్మం పరచబడి ఉన్నది. అదే ఆమెపక్క.)

ఋ క్షు డు

(దీర్ఘంగా నిట్టూర్చి) నే నెంత పతితుణ్ణయినాను !!

లో పా ము ద్ర

(పైకి చూచి) అగస్త్యుల శిష్యుడవు. ఇప్పుడే ఇంత క్రిందకు దిగిపోతే ముందు నీగతి ఇంకా ఏమి కానున్నదో !!

ఋ క్షు డు

భగవతీ! (చేతులు జోడించి) నేను నిజం చెపుతున్నాను. బాల్యంలో నేను ఇలా లేను. అప్పుడు స్త్రీనీ, మద్యాన్నీ దగ్గరకు రానిచ్చేవాణ్ణికాను. కాని ఇది అసురభూమి. పాపభూమి. క్షమించండి.

లో పా ము ద్ర

ఋక్షా ! ఈ భూమి పాపభూమి కాదు. నీ హృదయం దుర్బలమైనది.

ఋషుడు

(వక్షఃస్థలాన్ని విస్ఫారజేసి) భగవతీ! భారద్వాజీ! ఈ హృదయం ఒకప్పుడు వజ్రంకంటేకూడా కఠోరంగా ఉండేది. కాని ఈ నల్లని దస్యుకన్యలను చూడడంతోనే ఏదేమి కారణమో, అంత కఠోరమైన హృదయమూ హిమంతో సమానంగా కరిగిపోయింది. (ఏడుపు స్వరంతో) నేను పాపిని, భ్రష్టుణ్ణి.

లోపాముద్ర

(నవ్వి) తిరిగి పవిత్రుడవు కాగలవు. అది నీ చేతిలోని పని. నీవు సంయమాన్ని అవలంబించలేవా? (లేచివచ్చి) ఋషుని పక్కన చెట్టుపాదులో కూర్చుంటుంది. ఋషుడు ఎక్కడ ఉన్నవాడు అక్కడే ఉంటాడు. కూర్చున్న పద్ధతి మారుస్తాడు)

ఋషుడు

(కన్నీరు తుడుచుకొని) కాదు భగవతీ! అంతా చేయగలను, కాని సంయమం అవలంబించడంమాత్రం నావల్ల కావడం లేదు. దేవతలు నాకు వ్యతిరేకంగా ఏదో కుట్ర చేస్తున్నారు. వారిలో ఎవ్వరూ నా ప్రార్థనను వినడం లేదు. నన్నేమి చేయమంటారో మీరే చెప్పండి. ఎంత దృఢంగా ప్రార్థన చేద్దామని కూర్చుంటే అంతవేగంగా చిత్తం చంచలమై పోతున్నది. నేను అనార్యుణ్ణి అయిపోయినాను.

(లోపాముద్ర వైపుకు దైన్యభావంతో చూస్తూ కన్నీరు కారుస్తాడు)

లోపాముద్ర

మాటలవల్ల లాభ మేమున్నది? ఋషీ! నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి.

ఋష్యుడు

కాని భగవతీ! (వెక్కి-వెక్కి-ఏడుస్తూ) వాస్తవానికి నేనంత చెడ్డవాణ్ణి కాను. నన్ను విశ్వసించండి. (హఠాత్తుగా నవ్వుతాడు) దేవతలే మిమ్మల్ని ఇక్కడకు పంపించారు! మీ దర్శనం లభించడంతోనే నాలో పెద్దమార్పు రావడం ప్రారంభమయింది. (చెట్టు వెనకనుండి లోపాముద్ర చూడకుండా ఇద్దరు దస్యుకన్యలు చేతితో ఋష్యుని రమ్మని సంకేతం చేస్తారు) దుష్టకన్యలారా! వెళ్ళిపోండి. (లోపాముద్ర వెనకకు తిరిగి చూస్తుంది. దస్యుకన్యలు దాక్కుంటారు)

ఋష్యుడు

(తత్తరపాటుతో) ఇబ్బే! ఎవరూ లేరు. ఎవరూ లేరు, రోజురోజూ కొత్తవాళ్ళు రంగంలోకి వస్తున్నారు. నా హృదయాన్ని ముక్కలుముక్కలు చేస్తున్నారు. (దస్యుకన్యలు మళ్ళీ సంకేతం చేస్తారు.) పారిపోండి, వెళ్ళిపోండి (లోపాముద్ర తిరిగి వెనకకు చూస్తుంది. దస్యుకన్యలు దాక్కుంటారు.) ఎవరూ లేరు. ఇక ఈ జాతితోనే నేను సంబంధం పెట్టుకోను; పెట్టుకోను. భగవతీ! నేను పాపిని. మహాపాపిని.

లోపాముద్ర

ఋషీ! ఈ మాటలవలన ఏమీ ప్రయోజనం లేదు.

నీవు మద్యాన్ని సేవించకుండా ఒక్కనిమిషం గూడా ఉన్నట్లు కనపడడం లేదు.

ఋ ష్య డు

(ఏడుపుస్వరంతో) భగవతీ! ఈ విషయం నాకుగూడా అసహ్యంగానే కనపడుతున్నది. నే నెవరిని? నేను అగస్త్యుల వారి శిష్యుణ్ణి, తృత్సుజాతికి చెందినవాడను, ఈ విధంగా మద్యాన్ని సేవించి పడి ఉంటున్నానా? ఛీ! ఛీ! ఋష్యా! నీ జీవితం వృధా. (వెక్కి వెక్కి ఏడుస్తాడు) కాని ఏమి చేయను?

(దస్యుకన్యలు తిరిగి సంకేతం చేస్తారు. వెళ్ళిపొమ్మని ఋష్యుడుగూడా సంకేతం చేస్తాడు. లోపాముద్ర వెనకకు తిరిగి చూస్తూ ఉంటుంది.)

లో పా ము ద్ర

ఏమిచేయను, ఏమిచేయను అంటావేమిటి? మద్య సేవనం మానివేసెయ్యి. నీవు తాగినంత మద్యాన్ని అసురులు గూడా తాగడంలేదు.

ఋ ష్య డు

దయఉంచండి. (ఏడుస్తాడు) నేను చాలా మంచివాణ్ణి. ఈ అసురునిదుర్గాన్ని, ఈసొట్టముక్కు ఆడవాళ్లనూ, ఈ కారాగారవాసాన్నీ, అన్నింటినీ చూచి నామనస్సు వ్యాకులపడి పోతున్నది. నా శ్వాస ఆగిపోయిన ట్లనిపిస్తున్నది. నా కెంతో దుఃఖం కలుగుతున్నది. నేను అగస్త్యశిష్యుణ్ణి; సురను సేవించి మనోవ్యాకులత్వాన్ని పోగొట్టు కొంటున్నానా? ఋష్యా! నీకు ఎలాంటిస్థితి సంప్రాప్తించింది!! (ఆకాశం వంకచూస్తాడు)

లో పా ము ద్ర

ఋషా! నాకు మాట ఇవ్వు.

ఋ ష్య డు

ఏమని?

లో పా ము ద్ర

సురను సేవించ నని.

(దస్యు కన్యకలు ఋష్యన్ని పిలుస్తారు)

ఋ ష్య డు

(దస్యు కన్యలతో) నేను వస్తున్నాను. (లోపాముద్రతో) అరే! నే నేమన్నాను? ఈ చేతితో సురను సేవించను అని మాట యిస్తున్నాను. (లేవబోతాడు) నేను దుష్టుణ్ణి. పాపిని. కాని మాట నిలుపుకొంటాను. అగస్త్యశిష్యుడ నైన నాకు ఎలాంటి గతి సంప్రాప్తించింది! భగవతీ! మీరు రావడం మంచి దయింది. నన్ను ఉద్ధరించారు. మీ తేజోవంతాలైన నేత్రాలు నా హృదయాన్ని ఛేదించి అందులోనుండి శుద్ధసంకల్ప మనే సెలయేటిని ప్రవహింపజేసినవి. (కాళ్ళమీదపడి) నేటినుండి నేను మీ శిష్యుణ్ణి; పుత్రుణ్ణి—ఎప్పుడూ మద్యాన్ని ఈ చేతితో ముట్టుకోను. (దస్యు కన్యలను ఉండమని సంకేతం చేస్తాడు) నేను నా కుటీరంలోనికి పోతాను. సెల విప్వండి.

లో పా ము ద్ర

సరే, వెళ్ళు, విశ్వరథు డింకా రాలేదేమి?

ఋ ష్య డు

విశ్వరథుడు ఈ అసురులలో ఎవరికి జబ్బువచ్చినాఅశ్వినీ దేవతలను ఆవాహానచేస్తున్నాడు. (తిరస్కారపూర్వకంగా)

ఈ చప్పిడి ముక్కువాళ్ళకొరకు దేవతలను ఎందుకు పిలుస్తున్నాడో అర్థంకావడంలేదు.

(వెళ్ళిపోబోతాడు)

లోపాముద్ర

మానవులందరూ వరుణదేవుని సంతానమే. వారి సహాయానికి దేవతలను ఆహ్వానించవచ్చును.

ఋక్షుడు

ఈ నల్లవాళ్ళను ఎక్కడచూస్తే అక్కడే చంపమని గురువుగారు చెప్పేవారు కాదా ?

లోపాముద్ర

(లేచి) నీ గురువుగారికింకా రహస్యం భోదపడలేదు. రంగు, రూపము వేరైనంతమాత్రంచేత మనుష్యుడు పశువు కానేరడు.

ఋక్షుడు

(తెలిసినట్లు) ఆ! ఆ! ఇక నేనుగూడా అలాగే ప్రవర్తిస్తాను. రంగూ, రూపమూ వేరైనా మనుష్యుడు మనుష్యుడే. నిజం నిజం. రహస్యం నాకు ఇప్పటికి బోధపడింది. అందువల్లనే ఈ నల్లటికన్యలను చూడగానే నామనస్సు ఇంత వ్యాకులపడుతున్నది.

(తలవూపుతూ వెళ్ళిపోతాడు)

లోపాముద్ర

(మోకాళ్ళమీద కూర్చుని అగ్నిలో సమిధలను వేస్తుంది)

(నెమ్మదిగా) ఋక్షుడు పశువై ఆర్యత్వాన్ని సిగ్గు

పరుస్తున్నాడు. దస్యుగృహాలలో మరేమి జరుగుతుంది? కౌశికునికిగూడా ఎలాంటి స్థితి సంభవించింది ?

(చేతులు జోడించి ఆకాశంవైపుకు తలెత్తి ప్రార్థిస్తుంది)

ఇంద్రదేవా! మఘవన్ ! శతమన్యూ ! సహాయం చేయండి. ఆర్యులకు విజయాన్ని ప్రసాదించండి. (నిలబడి జుట్టు సవరించుకొంటుంది) విశ్వరథు డింకా రాలేదేమి ? నెళ్ళి గుడ్డలు శుభ్రం చేసుకొంటాను. (వెళ్ళిపోతుంది)

(ఉగ్ర ప్రవేశిస్తుంది)

ఉగ్ర

(నలువైపులా చూచి) లోపాముద్ర ఎక్కడకు వెళ్ళింది? ఇక్కడ లేదు. (చెట్టుపాదులో అక్షత లుంచి నిలబడుతుంది) నాగపితా ! ఈ గౌరాంగి చాలా దుష్టురాలు. ఓ మణిధర పితా! ఈమె నా విశ్వరథుని కాజేయడానికి వచ్చింది. ఈమెను కాటువేయి. ఈమె గౌరవర్ణపుశరీరాన్ని నల్లగా చేసివేయి.

(విశ్వరథుడు ప్రవేశిస్తాడు. ఉగ్రను చూచి ఉలిక్కి పడతాడు)

విశ్వరథుడు

శాంబరీ! ఎప్పుడొచ్చావు ? ఏమిచేస్తున్నావు ? భగవతి ఎక్కడ ?

ఉగ్ర

నేను నిన్ను కలుసుకొందామని వచ్చాను.

విశ్వరథుడు

అప్పుడేనా ? ఇంకా సమయ మున్నదికదా !

ఉగ్ర

(వ్యాకులంగా) ఏమి, నే నందంగా లేనా ?

విశ్వరథుడు

పిచ్చిదానా ! ఏమిటి ఆ ప్రశ్న ?

ఉగ్ర

(భయపడుతూ) నా హృదయంలో ఏదో శూలం గుచ్చుకొన్నట్లుగా ఉన్నది. ఎందుకో నీవు వెళ్ళిపోయినావని పించింది.

విశ్వరథుడు

జీవించిఉంటే ఎప్పుడో ఒకప్పుడు తప్పక వెళ్ళిపోతాను. ఎల్లప్పుడూ ఈ కారాగారవాసంలోనే నన్ను ఉంచదలచు కొన్నావా ?

ఉగ్ర

(రెండుచేతులూ జోడించి) నన్ను వదలి వెళ్లిపోతావా ? (కన్నీరు కారుస్తుంది)

(విశ్వరథుడు దగ్గరకు వచ్చి ఆమెవీపుమీద చెయ్యి వేస్తాడు)

విశ్వరథుడు

వదలివెళ్ళను, వదలివెళ్లను అని ఎన్నిసార్లు చెప్పను ? మాటిమాటికీ ఈ కన్నీళ్ళేమిటి ?

ఉగ్ర

నన్ను వదలి వెళ్లిపోతావు.

విశ్వరథుడు

(నలువైపులా చూచి) ఎందువల్ల నీ కా అభిప్రాయం కలిగింది ?

ఉగ్ర

నా కలాగే అనిపిస్తున్నది. ఇంతవరకూ నీవు ఎంతో దుఃఖంతో కనిపించేవాడివి. కాని ఆ లోపాముద్ర వచ్చినదగ్గర నుండీ నీకళ్ళలోనికి క్రొత్తకాంతి ప్రవేశించింది.

విశ్వరథుడు

అవును ఉగ్రా! భగవతి వచ్చినదగ్గరనుండి భరత గ్రామంలో, నా ఇంట్లో ఉన్న ట్లనిపిస్తున్నది.

ఉగ్ర

(ఏడ్చి) అవును. నాకు తెలుసును ఈ లోపాముద్ర నిన్ను ఎగరవేసుకొని పోతుంది. నాకు అంతా తెలుసును. (పెద్దగా ఏడుస్తుంది)

విశ్వరథుడు

అలా ఏడుస్తా వెందుకు? ఆమె చరణ స్పర్శతో ఈ కారాగారంలోగూడా మహాఅథర్వణుల, అగస్త్యుల ఆశ్రమాలలోని తేజస్సు వ్యాపించింది. నేను సోమపానం చేసినట్లూ, వరుణదేవుడు నా హృదయంలో నివాసం ఏర్పాటు చేసుకొన్నట్లూ అనిపించి నా నరనరాలూ నాట్యం చేస్తున్నవి. ఉగ్రా! నీవి పిచ్చిమాటలు! (ఉగ్రను ఆలింగనం చేసుకొంటాడు, ఆమె వెక్కి వెక్కి ఏడుస్తుంది) వెళ్ళు వెళ్ళు. రాత్రి ప్రొద్దుపోయిన తరువాత నా కుటీరంలోనికి రా. నేను కొంచెం ఆలస్యంగా వస్తాను.

ఉగ్ర

(దూరంగా పోయి కళ్ళు తుడుచుకుని) వెళ్ళనా?

(వెనుకనుండి పద ధ్వని వినపడుతుంది)

విశ్వరథుడు

ఆం! వెళ్ళు, నేను భగవతితో మాట్లాడాలి.

ఉగ్ర

(దీర్ఘంగా నిట్టూర్చి) సరే, (దీనంగా క్రిందకుచూస్తూ వెళ్ళిపోతుంది)

విశ్వరథుడు

ఈమె స్త్రీయేనా ? (ఆలోచించి) నాకుగూడా పిచ్చి ఎత్తింది……………ఏమీ సందేహం లేదు. శాంబరీనగరం లుప్తమైనట్లున్నది……అదిగో అథర్వణుఁ ఆశ్రమవృక్షాలు ప్రభాతకాలపు మందపవనంలో మెల్లమెల్లగా ఊగుతున్నవి. (స్వప్నం చూస్తున్నట్లుగా) అదిగో సరస్వతీనది ప్రవహించి పోతున్నది…… భగవతి ప్రఫుల్లిత నేత్రాలతో, గంభీరమూ, మధురమూ అయిన కంఠస్వరంతో దేవతారాధన జరుపుతున్నది. ఉద్యానవన మంతా దైవకాంతితో తళతళలాడిపోతున్నది. నేను ఎనిమిది సంవత్సరాల వయస్సులో ఉన్నాను… జమదగ్నిచెయ్యిపట్టుకొని కన్నులారా భగవతిని దర్శించాను. (చూస్తూ ఉండిపోతాడు) నాదగ్గరకు ఆమె దయ చేసింది. మెల్లగా క్రిందకు వంగి–నన్ను ముద్దుపెట్టుకొన్నది. (బుగ్గసవరించుకొంటాడు)జగత్సారమంతా ఆ ముద్దులో ఇమిడి పోయింది. నేటికిగూడా ఆ ఆహ్లాదభావం అలాగే ఉండిపోయింది.

(లోపాముద్ర వెనకనుండి ప్రవేశిస్తుంది, నిలబడి నవ్వుతుంది)

లోపాముద్ర

ఏమి ఉండి పోయింది ?

విశ్వరథుడు

(సిగ్గుపడి) ఉండిపోయింది. ఏమిటి?... ... ... ... ...
ఏమీలేదు.

(నవ్వి) ఎవరితోనో మాట్లాడుతున్నావు?

విశ్వరథుడు

ఉగ్ర ఇప్పుడే వచ్చిపోయింది.

లోపాముద్ర

కౌశికా! ఆ బాలిక నీకోరకై సర్వస్వాన్నీ అర్పించే టట్లున్నది.

విశ్వరథుడు

భగవతీ! ఏమిచేయను? ఉగ్ర కారాగారంలోకూడా నన్ను శాంతిగా ఉండనీయడం లేదు. నేను ఆమెవంకనైనా చూడలేదు. కాని ఆమె నా కాళ్లమీద తనప్రాణాలను సమర్పించడానికి సిద్ధమై కూర్చున్నది. మీరు అంగీకరించరు. నా మాటను విశ్వసించరు. కేవలం దయాభావంతో ఆమెను నేను స్వీకరించాను. తప్పలేదు. (కటువుగా) అగస్త్యమహాముని శిష్యుణ్ణి. ఈ దస్యుకన్యతో సంసారం చేస్తున్నాను. అనేక సార్లు తప్పుచేస్తున్నా ననుకొన్నాను. కాని ఏముచేయను? భగవతీ! నేను భరతుల పేరును అపవిత్రం చేశాను. ఆమెలో కన్పించే కరుణాజనకమైన ఆ తన్మయత యమపాశంకంటే కూడా ఎక్కువ క్రూరంగా, అభేద్యంగా ఉన్నది.

(క్రిందకు తలవాల్చి నిలబడతాడు)

లోపాముద్ర

(విశ్వరథుని భుజంమీద చేయివేసి) పుత్రకా! దీనిలో నీవు చేసిన దోషమేమీ లేదు. ఈ కన్యహృదయం శంబరుని హృదయంలాగానేఉదారమూ, ప్రేమపూరితమూఅయిఉన్నది.

విశ్వరథుడు

ఈ విషయం గురువుగారికి తెలిస్తే ఏమనుకొంటారు?

లోపాముద్ర

అగస్త్యులవారిని నేను కలుసుకొని చాలారోజులయింది. నేను విన్నదానిని బట్టి బహుశా వారు నిన్ను క్షమించరు. (నవ్వి) కాని అవన్నీ మనకు అనవసరం. శరీరపురంగునుబట్టి స్వభావం మారుతుందని నేను విశ్వసించను.

విశ్వరథుడు

నిజమా, ఎగతాళియా?

లోపాముద్ర

నిజమే చెప్పుతున్నాను.

విశ్వరథుడు

భగవతీ! నాకుగూడా అలాంటిభావమే కలుగుతున్నది. మీ మాట సత్యమే. మన ఆర్యులు దస్యులను సంహరిస్తున్నారు. వారు దేవతలకు విరోధులని అంటున్నారు. కాని - కాని - ఈ ఆరు ఏడు నెలల పరిచయంతో దస్యులు అసురులు కారని నిర్ణయించుకున్నాను.

లోపాముద్ర

ఆ భైరవుడుతప్ప. అవకాశం దొరికితే ఆభైరవుడు నన్ను అమాంతం మింగివేస్తాడు.

విశ్వరథుడు

అవును. వాడొక్కడే దుష్టుడు కనపడుతున్నాడు. కాని, మిగతావారు ఎంతో తెలివిగలవారు. నా అభిప్రాయం ప్రకారం వారిలో ఉన్న కొన్ని మంచిగుణాలు మనలోగూడా లేవు.

లోపాముద్ర

కాని దస్యులు దేవతలను ద్వేషిస్తున్నారు. ఆ ద్వేషం ఉన్నంతకాలమూ వారిని సంహరించడం తప్పనిసరి అవుతున్నది. విశ్వరథా! కూర్చో. (తాను కూర్చుంటుంది) నీకథ నంతా చెప్పు. మనం కలుసుకొని ఎన్ని సంవత్సరా లయింది !! (విశ్వరథుడు లోపాముద్రకాళ్ళదగ్గర కూర్చుంటాడు.)

విశ్వరథుడు

పధ్నాలుగు సంవత్సరా లయింది. చూస్తూచూస్తూనే నేను ఎంత పెద్దవాణ్ణి అయినాను!

లోపాముద్ర

(ప్రశంసాపూర్వకంగా చూచి) సవితృదేవతవలె ఉన్నావు. (నవ్వి) శాంబరి నిన్ను ప్రేమించిందంటే అందులో ఆశ్చర్య మేమున్నది! తరువాత ?——

విశ్వరథుడు

తరువాత ఇంకా ఏమున్నది! అధర్వణ మైత్రావరుణులు నాకు విద్యను ప్రసాదించారు. ఏడు నెలలనుండి ఈ కోటలో పడి ఉన్నాను. (కొంచెంసేపు ఆగి) నేను మనుష్యుడుగా లేను. సూర్యుడు ఉదయిస్తున్నాడు, అస్తమిస్తున్నాడు. చివరకు భరతులనుగూడా మరచిపోతున్నాను. స్వజనులూ, ఘోషా

మూర్తా, సత్యఅథర్వణులూ, అందరూ బాల్యంలో విన్న కథలలోని పాత్రలవలె అదృశ్యులవుతున్నారు.

(ఋక్షుడు తొట్రుపడుతూ ప్రవేశిస్తాడు.)

ఋక్షుడు

(తాగినవాడిలాగా మాట్లాడుతూ) భ. భగవతీ! నేను మాట నిలుపుకున్నాను. మా... మా... మా... ట నిలుపుకున్నాను. ని... ని... ని... జం చెపుతున్నాను. నేను సురను తాకనైనా లేదు. (విశ్వరథుడు ఋక్షునిదగ్గరకు వెళ్లుతాడు.)

విశ్వరథుడు

(ఋక్షుని చెయిపట్టుకొని గట్టిగా ఊపి) ఏమిటి వాగుతున్నావు )

లోపాముద్ర

కౌశికా! సురను తాకనని ఇప్పుడే నాకు మాట యిచ్చి వెళ్ళాడు.

ఋక్షుడు

ని... ని... జం.... నేను మా... మా... ట తప్పలేదు.

విశ్వరథుడు

అయితే ఇదేమిటి?

ఋక్షుడు

ఇదా? నేను మద్యాన్ని చేత్తో తాకలేదు.

విశ్వరథుడు

అయితే అది పొట్టలోకి ఎలా పోయింది?

ఋక్షుడు

ఆ చప్పిడి ముక్కుదాని నోట్లో పోసి పోయింది. భగవతీ! నే... నేను నిజం చెపుతున్నాను. నేను ఈ చేత్తో ఒక్క చుక్కనుగూడా ముట్టలేదు.

లోపాముద్ర

సరేలే, అటు కూర్చో.

ఋక్షుడు

ఈ విశ్వరథుని మాట నమ్మవద్దు (వెకిలిగా నవ్వుతాడు) నేను నిజం చెపుతున్నాను.

లోపాముద్ర

సరే, సరే,

(ఋక్షుడువచ్చి లోపాముద్ర కాళ్ళదగ్గర కూర్చుంటాడు. లోపాముద్ర ఋక్షుని శిరస్సును నిమురుతుంది)

విశ్వరథుడు

భగవతీ! సప్తసింధు సంగతు లేమిటి? గురువర్యులు ఏమంటున్నారు? యుద్ధవ్యవహారం ఎంతవరకు వచ్చినట్లు?

లోపాముద్ర

నాకుగూడా వివరాలు తెలియవు. మిమ్మల్నిద్దరినీ శంబరుని దూతలు బంధించి తెచ్చిన తరువాత శంబరుడు ఒక దూతను గురువుగారి దగ్గరకు పంపించాడు.

విశ్వరథుడు

అవును, తుగ్రుని పంపించాడు.

లోపాముద్ర

శంబరుడు తన దుర్గాలను తిరిగి ఇచ్చివేయ మన్నాడు. అందుకు బదులుగా మైత్రావరుణులు యుద్ధసన్నద్ధు లైనారు. దాసునితో మైత్రిచేయడానికి వీలులేదని కబురంపించారు.

విశ్వరథుడు

దివోదాసు ?

లోపాముద్ర

దివోదాస అతిథిగ్వుడు పక్షులతో యుద్ధం చేస్తున్నాడు. శృంజయరాజు సోమకుడు జబ్బుగా ఉన్నాడు. శంబరుని దుర్గాలను తిరిగి ఇచ్చివేయడం మంచిదని – మహా అథర్వణులు కబు రంపించారు.

విశ్వరథుడు

అందువల్లనా శంబరుడు భరతులను జయిస్తున్నాడు ?

లోపాముద్ర

అవును, అగస్త్యులు ఓడిపోయినమాట నిజమే. కాని మైత్రావరుణులు ఈకొద్దినెలల్లోనే మీా భరతులకీర్తిని ఇనుమడింపజేశారు.

విశ్వరథుడు

(సంతోషంగా) ఎలాగా ?

ఋక్షుడు

(కళ్ళు తెరచి) వివరంగా చెప్పాలి.

లోపాముద్ర

శంబరుడు ఇక్కడ ఎంత అమాయకుడుగా కనబడతాడో యుద్ధంలో అంత భయంకరు డవుతాడు. వరుణునివలె మహా

క్రూరంగా యుద్ధం చేస్తాము. మహాశకపటి. అతడు వనాలకూ, పర్వతాలకూ రాజు కావడంవల్ల అతణ్ణి కదకి పట్టుకోవడం గూడా అసాధ్య మవుతుంది.

ఋ షు డు

నేనూ అదే అనబోతున్నాను.

లో పా ము ద్ర

అవునవును (ఋషినితల నిమురుతుంది)

వి శ్వా ర థు డు

తరువాత గురుదేవులు ఏమిచేశారు ?

లో పా ము ద్ర

గురుదేవులు చూపించిన పరాక్రమాన్ని సప్తసింధులో ఎవరూ ఇంతవరకు చూపించలేదు. వారు ఇంద్రుని సహాయంతో యుద్ధం చేశారు. ఇంద్రుడు వారిని వదలినప్పుడు అశ్వినీదేవతల సహాయంతో వనాల నన్నింటినీ దగ్ధంచేశారు. శతద్రుజలాన్ని చేతితో ఎత్తి అవతల పారబోశారు. పర్వతాలను లంఘించారు. సరస్వతీతీరంలోని తపోవనాలను కాల్చి భస్మం చేయడానికి బయలుదేరిన శంబరుడు శతద్రునదినిదాటి అవతలకు పోలేకపోయినాడు.

వి శ్వా ర థు డు

మరి శంబరుడే జయించా డంటున్నారేమిటి ?

ఋ షు డు

నేనూ అదే అడగబోతున్నాను.

లో పా ము ద్ర

అవును. ఈనాడు అతడు జయించినట్లే. తన దుర్గాల

నన్నింటినీ తిరిగి తీసుకొన్నాడు. కాని మీ భరతులు ఆత్మ గౌరవాన్ని వదిలేవారు కారు. గురుదేవులు ఇంతమాత్రంతో వెనుకంజ వేయరు. సరస్వతీ శతద్రు నదుల మధ్యనున్న మార్గాన్ని నాకు అడ్డగించి ఉన్నారు. నిన్న అరణ్యాలున్న చోట ఇవాళ భరతులు గ్రామాలను నిర్మిస్తున్నారు.

విశ్వరథుడు

గురుదేవులు మహా ప్రతిభాశాలురు.

లోపాముద్ర

నిజం ఇంద్రుడు తన అభిప్రాయాన్ని మార్చుకొన్నట్లూ, గురుదేవులకు సహాయం చేయడానికి వాగ్దానం చేసినట్లూ విన్నాను.

ఋషుడు

నేనూ అదే చెప్పబోతున్నాను.

లోపాముద్ర

(నవ్వి) నీవు చాలా తెలివిగలవాడవు. కానీవు నిశ్శబ్దంగా కూర్చో.

విశ్వరథుడు

ఈ కారాగారంలోనుండి నాకు విముక్తి ఎప్పుడో?

లోపాముద్ర

కొద్దిరోజులలోనే ఉషాదేవి నాకు మాట యిచ్చింది. నామీద అత్యాచారం జరిగితే దేవతలు సహించరు.

ఋషుడు

అవును. సహించరు (లేచినిలబడతాడు) అవును. సహించరు.

విశ్వరథుడు

కూర్చో.

ఋక్షుడు

కూర్చోను.

విశ్వరథుడు

అయితే వెళ్ళి పడుకో, పో.

ఋక్షుడు

పోను.

లోపాముద్ర

(నవ్వి) ఋక్షా! ఇంతకుముందే అంతగా పశ్చాత్తాప పడ్డావు. సహజస్వభావాన్ని వదలలేక పోతున్నావు.

ఋక్షుడు

భ... భగవతీ! నేనా? నాలోనుండి పశ్చాత్తాపపు నిర్ఝరులు ప్రవహిస్తున్నవి.

లోపాముద్ర

అవి వెంటనే ఎండిపోతవి.

ఋక్షుడు

(ఏడుపుగొంతుతో) మీా... మీాకూ సందేహమేనా? భ... భగవతీ! నన్ను క్షమించండి. నేను చాలా అ... అధముణ్ణి. నేను చాలా ప... పశ్చాత్తాప పడుతున్నాను. నన్ను క్షమించారా? క్షమించారా? నిజంగా? లేదు. నేను... పా... పాపిని. (ఏడుస్తాడు)

లోపాముద్ర

విశ్వరథా! ఈ ఋక్షుని కుటీరంలో దిగవిడచిరా. రేపు ఉదయం వీని సంగతి ఆలోచిద్దాం.

విశ్వరథుడు

పశ్చాత్తాపం అనే నెపంతో ఎంతగా కన్నీరు కారుస్తాడో అంతగా మద్యాన్ని తిరిగి సేవిస్తాడు.

లోపాముద్ర

కారాగారజీవితం కాంచనాన్నిగూడా మలినపరుస్తుంది.

విశ్వరథుడు

(ఋక్షునితో) పద.

ఋక్షుడు

వస్తున్నాలే! భ... భగవతీ! నేను... చాలా ప... పశ్చాత్తాప పడుతున్నాను.

(విశ్వరథుడు ఋక్షుని చేయిపట్టుకొని తీసుకొని పోతాడు.)

లోపాముద్ర

హవ్యవాహనా! ఆర్యులగతి ఏమి కానున్నది? శంబరుడే జయించి ఆర్యులు దస్యుల ఆధిపత్యాన్ని స్వీకరించవలసివస్తే ఏమవుతుంది!! దేవీ! దేవీ! ఈ వినాశనాన్నుండి ఆర్యులను రక్షించు. మైత్రావరుణులకు విజయాన్ని ప్రసాదించు. సప్తసింధులోని ఆర్యులను నిర్భయులనుగా చేయి. (అగ్ని దగ్గరకు వెళ్ళి సమిధలు అగ్నిలో వేస్తుంది. మోకాళ్ళమీద కూర్చొని అగ్నిని ప్రార్థిస్తుంది) మా స్థితి ఏమి కానున్నది? శంబరుడు జయిస్తే దస్యులసేవను ఆర్యులమైన మేము అంగీకరించవలసివస్తుంది. తరువాత మా తేజస్సు మందమై పోతుంది. మా తపస్సు ఎందుకూ కొరగాకుండా పోతుంది. మాలోని పరిశుద్ధత

లు ప్తమైపోతుంది. ఆర్యులందరూ బుక్షులై పోతారు. (కొంచెం సేపు కూర్చుని) విశ్వరథునికి దేవతలు ఎంతసౌందర్యాన్ని ప్రసాదించారు! (నవ్వి) కాని అతనిని నేను నిరాశపరచబోతున్నాను. దేవీ! నారూపం ఎంతమందినో సంతాపపరచింది. కాని ఈ యువకుని రక్షించు. (కొంచెంసేపు ఆగి) విశ్వరథునిలాంటి యువకు లుండగా దేవతలు ఆర్యులను విడిచిపెట్టరు. ఓ దేవతలారా! ఈ దస్యులకు సద్బుద్ధిని ప్రసాదించరాదా? (లోపాముద్ర నెమ్మదిగా మృగచర్మంమీద పడుకొని నిద్రపోతుంది. భైరవుడు నెమ్మదిగా ప్రవేశిస్తాడు. నలువైపులా చూచి లోపాముద్రదగ్గరకు వస్తాడు. కొంచెంసేపు వికటంగా నవ్వుతాడు. లోపాముద్రను ముద్దుపెట్టుకోడానికి ప్రయత్నం చేస్తాడు. లోపాముద్ర మేల్కొంటుంది, లేచి దూరంగా పోబోతుంది. భైరవుడు ఆమెను పట్టుకుంటాడు.)

లోపాముద్ర

ఎవడవు? ఎవడవు?

భైరవుడు

మూర్ఖురాలా, (ఆమెనోరు మూసివేయబోతాడు)

లోపాముద్ర

ఇంద్రదేవా! రక్షించు. విశ్వరథా!

భైరవుడు

అరవకు. (ఆమె నోటిమీద చెయ్యి పెడతాడు)

లోపాముద్ర

ఓ, ఓ, ఓ,

(విశ్వరథుడు రొప్పుకుంటూ ప్రవేశిస్తాడు. భైరవునితో తల పడతాడు)

విశ్వరథుడు

భైరవా! నీచుడా!

భైరవుడు

నీవా! (పళ్లు కొరుకుతాడు)

విశ్వరథుడు

అవును.

భైరవుడు

కాచుకో.

(ఇద్దరూ పెనగులాడుతారు)

లోపాముద్ర

(చేతులు జోడించి) ఇంద్రదేవా! మమ్ము రక్షించు. బుతౌ! బుతౌ!!

భైరవుడు

ఊం ఊం (విశ్వరథుని ఎత్తి అవతల పడవేస్తాడు)

విశ్వరథుడు

ఓ. ఓ.

(భైరవుడు విశ్వరథుని గుండెలమీద కూర్చుంటాడు)

లోపాముద్ర

ఓ దేవా!

విశ్వరథుడు

ఇతనిచేతిలోని కత్తిని లాగివేయి.

లోపాముద్ర

విశ్వరథా! భయపడకు. సాహసంగా పోరాడు.

(భైరవుని వెనకనుండి పట్టుకొని లాగుతుంది. భైరవుడు కత్తి లాగబోతాడు. లోపాముద్ర అడ్డుపడుతుంది. భైరవుడు లోపాముద్రను నెట్టిపారవేస్తాడు.)

లోపాముద్ర

పాపీ!

(భైరవుని కత్తివున్న చేతిని నోటితో గాయపరుస్తుంది.)

భైరవుడు

అబ్బా! (విశ్వరథుని గొంతు పట్టుకొంటూ) కౌశికా! ఉగ్ర కాలు ... రకై ఎదురు చూస్తున్నాడు. ఈ ఈ ఊ ఊ. (గొంతు పిసుకుతాడు)

విశ్వరథుడు

అబ్బా!

(ఇంతలో ఉగ్ర ప్రవేశిస్తుంది. ఆడ సింహంలాగా తన కత్తి తీసుకొని భైరవునిమీదకు దూకుతుంది.)

ఉగ్ర

కౌశికా! భైరవా: నీచుడా! (భైరవుని మెడమీద కత్తి పెడుతుంది) లే. లే. నీచుడా!

భైరవుడు

నీ వెక్కడనుండి వచ్చావు? (కత్తి గుచ్చుకోవడంవలన బాధపడతాడు) అబ్బా! అబ్బా! (విశ్వరథుని వదలి భైరవుడు లేస్తాడు పళ్లు కొరుకుతాడు. పిడికిలిబిగించి ఉగ్రవైపుకు చూపిస్తూ వెళ్ళిపోతాడు. మూర్ఛితుడైన కౌశికునితలను ఉగ్ర తన వొడిలో పెట్టుకొంటుంది.)

ఉగ్ర

కౌశికా!

(తానుగూడా మూర్ఛితురాలై విశ్వరథుని వక్షం మీద పడిపోతుంది)

లోపాముద్ర

విశ్వరథా!

తెర పడుతుంది.

•

# మూడో దృశ్యం

(ఒక నెల గడచింది. సంధ్యాసమయం. ఉగ్రకుటీరం. ఒక వైపునుండి కోటగోడ కనపడుతూ ఉంటుంది. కుటీరం ముందు మృగచర్మంమీద ఉగ్ర కూర్చొని ఉన్నది. దాగి ఆమెకు జడవేస్తున్నది. సూర్యకిరణాలలో ఆమె పొడవైన వెంట్రుకలు తళతళలాడుతున్నవి. దాగి ఉండిఉండి ప్రేమతో ఉగ్రను చెంపదెబ్బలు వేస్తున్నది. ఎదుట రెండు నెమలి ఈకలు పడిఉన్నవి. దాగివయస్సు షుమారు ఏభై సంవత్సరాలుంటుంది.

ఉగ్ర

దాగీ ! నొప్పి పుడుతున్నది.

దాగి

సరిగ్గా కూర్చో.

ఉగ్ర

నెమలిఈకలు రెండే తెచ్చావేం ?

దాగి

ఇంతకంటే ఎక్కువ ఎక్కడ తెమ్మంటావు ?

ఉగ్ర

శంబరునిపుత్రికను అలంకరించడానికి నెమలిఈకలు రెండేనా తేవడం ? చాలవు. వెళ్ళి ఇంకా తీసుకొనిరా.

దాగి

ఇవాళ సంతోషంగా ఉన్నావే ?

ఉగ్ర

(దాగిని ఆలింగనం చేసుకొని) అవును. ఎవ్వరితో చెప్పకు. ఈరోజు కౌశికుడు చాలా ఆనందగా ఉన్నాడు.

దాగి

పిచ్చి పిల్లా! మనం ఓడిపోతున్నాము. అందువల్ల కౌశికుడు ఆనందగా ఉంటున్నాడు.

ఉగ్ర

చాల్లే. అవు. నాన్నగారిని ఓడించే వాళ్ళెవరు?

దాగి

కాదమ్మా! కిందనుండి కోటలోనికి గూడా సామాన్లు ఏమీ రావడం లేదు. అందువల్లనే కావలసినన్ని నెమలిఈకలు దొరక లేదు.

ఉగ్ర

దాగీ! ఎంతో ఆనందంగా ఉండవలసిన ఈ రోజున ఇలాంటి మాటలు చెప్పకు. నాన్నగారు ఇంతవరకు ఎప్పుడూ ఓడిపోలేదు. ఓడిపోరు. ఇవాళ ఓడితే రేపు గెలుస్తారు. నా చిన్నతనంనుండి ఇలాంటి సమాచారాలు ఎన్ని విన్నానో! (అకస్మాత్తుగా లేచినిలబడి) అదుగో కౌశికుడు వచ్చాడు.

విశ్వరథుడు

(విశ్వరథుడు ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. నవ్వుతున్నాడు) శాంబరీ! జడ వేయించుకుంటున్నావా? చూడు. ఎంత అద్భుతమైన యుద్ధం జరుగుతున్నదో! ఇక్కడినుండి అంతా చూడవచ్చును.

(ఉగ్ర కోటగోడమీదనుండి చూస్తుంది)

ఉగ్ర

అబ్బా! ఆ యుద్ధం నేను చూడలేను. యుద్ధం చూసి చూసి నీ కింకా తృప్తి తీరలేదా? అబ్బా! కూర్చుందూ!

విశ్వరథుడు

ఎలా కూర్చోను? చూడు చూడు. దుమ్ముతో నిండిన ఆకాశాన్యాచక్రాలను చూడు. అక్కడే మా గురువులూ, మీ నాన్నా యుద్ధం చేస్తున్నారు.

(వోళ్లు విరిచి ఆ వైపు చూస్తుంది) నీ కెలా తెలుసు?

విశ్వరథుడు

ఉండు. నేను భగవతిని పిలుచుకొని వస్తాను. (వెళ్లి పోతాడు)

ఉగ్ర

ఆ లోపాముద్ర లేనిది కౌశికునికి క్షణం తోచదే!

దాసి

ఆవిడవిషయం చిత్రంగానే ఉన్నది.

ఉగ్ర

కౌశికుడు నా పుత్రుడంటుందే?

దాసి

ఆ మెఎత్తులు అసలు అర్థమైతేగదా? నిన్న తుగ్రునితో కూడా పకపకలాడుతూ మాట్లాడుతున్నది. ఈమె మన కోటలో ప్రవేశించినది మొదలు ఉగ్రకాలునికిగూడా మనమీద కోపం వచ్చింది నిన్న... వినలేదా?

ఉగ్ర

లేదు. (భయపడుతుంది)

దాగి

ఉగ్రకాలునికి బలియిచ్చిన మేక మేఁమేఁ అని అరచింది.

ఉగ్ర

(భయంగా) ఏమిటి ? నిజమేనా ?

దాగి

అందువల్లనే మనకు అపకారం జరుగుతున్నది.

ఉగ్ర

ఉగ్రకాలుడు ఆమెను పిలుచుకొనిపోతే పీడ వదలుతుందిగదా ?

దాగి

ఏమో, ఏమి కానున్నదో ! భైరవుడైనా ఉంటే ఉపాయం చెప్పేవాడు.

(లోపాముద్ర, ఋక్షుడు, విశ్వరథుడు ప్రవేశిస్తారు. ముగ్గురూ మహోడల్లాసంగా ఉన్నారు. యుద్ధాన్ని చూస్తున్నారు.)

విశ్వరథుడు

ఆ పర్వతం అగపడుతున్నదే, అటే.

లోపాముద్ర

ఆ జలాశయందగ్గరగానా ?

ఉగ్ర

(నెమ్మదిగా విశ్వరథునిదగ్గరకు వస్తుంది.) ఏది ? నన్నుకూడా చూడనివ్వు. (దాగి కొంచెందూరంగా నిలబడి ఉంటుంది.)

విశ్వరథుడు

(ఉగ్రభుజంమీద చేయివేసి) ఆ జలాశయం కనపడు తున్నదా? అటు – అటు – ఆ వైపు. ఆసుడిలో చూడు. అదే మా గురువుగారి రథం.

లోపాముద్ర

దేవా! ఆర్యులశత్రువులను సంహరించు. అథర్వణ మైత్రావరుణులకు పూర్తిబలాన్ని ప్రసాదించు. భరతుల బాణాలలో నీ వజ్రపుశక్తిని ప్రవేశపెట్టు.

ఋక్షుడు

(ఎగిరి) అరే, అదేమిటి? ధ...ధ...ధ... ...

(విశ్వరథ, లోపాముద్ర, ఉగ్రలు ముగ్గురూ ఒక్కసారి)

ఏమిటేమిటి?

ఋక్షుడు

మేఘంలాగా పరుగెత్తుకొని ఆ వస్తున్న దెవరు?

లోపాముద్ర

ఎవరో వస్తున్నారు.

విశ్వరథుడు

(లోపాముద్ర చేయిపట్టుకొని ఉత్సాహంతో) భగవతీ!

లోపాముద్ర

ఏమిటి?

విశ్వరథుడు

అవి మహాఅథర్వణుని అశ్వరాజాలు. అవే. అవే. మహాఅథర్వణులుగాక ఇంకెవ్వరు ఇంతవేగంగా రాగలరు?

లోపాముద్ర

(నవ్వి) అవును. మహా అథర్వాణులు నన్ను రక్షించడానికి తప్పకుండా వస్తారనుకొన్నాను. భృగువర్యా! ధన్యాస్మి.

ఉగ్ర

వారెవరు ?

విశ్వరథుడు

నా బావగారు. వారిదగ్గర ఎన్నోవేల శ్వేతాశ్వా లున్నవి. ఇక శంబరుడు (మధ్యలో ఆగిపోతాడు)

ఉగ్ర

(గంభీరంగా) ఏమంటున్నావు ? మా నాన్నగారు...

లోపాముద్ర

వారు ఈ కోటవైపునకే వస్తున్నారు.

ఋషుడు

(ఎగిరి) అథర్వాణులు తప్పకొన్నారు. తప్పకొన్నారు. (విశ్వరథుని ఆలింగనం చేసుకొంటాడు.)

విశ్వరథుడు

అటుచూడు, అసురులు ఎక్కడివారక్కడ పారిపోతు న్నారు.

ఉగ్ర

(విశ్వరథునితో) మా నాన్నగారి స్థితి ఏమిటి ?

(ఎవ్వరూం వినిపించుకోరు.)

లోపాముద్ర

విశ్వరథా! అథర్వాణులవారి పరశువులో వజ్రపుశక్తి

నిండి ఉన్నది. వారు ఆక్రమణకు బయలుదేరితే పర్వతాలు గూడా కంపించిపోతవి. (మెల్లగా) కౌశికా! మా నాన్నగారు గూడా నా మీద ఇంత దయగలిగి ఉండరు!

విశ్వరథుడు

కనుకనేగా నిన్ను విడిపించడానికి వారు యుద్ధానికి బయలుదేరారు. నన్ను బాధించినప్పుడు వారు మాపైనా మాట్లాడారా?

ఉగ్ర

(లోపాముద్రచెయి పట్టుకొని) లోపాముద్రా! నా తండ్రిస్థితి ఏమవుతుంది?

లోపాముద్ర

(ఉగ్రతల నిమురుతూ) ఏమవుతుందో చూద్దాము. (వీపుమీద చెయి వేసి) అమ్మాయీ!

ఋషుడు

మహా అథర్వాణులు మంచిపని చేశారు. చంపండి.

ఉగ్ర

కౌశికా! మహా అథర్వాణులు నా తండ్రిని చంపివేస్తారా? (అందరూ నిశ్శబ్దంగా ఉంటారు. కుటీరం వెనుకనుండి తుగ్రుడూ ఇద్దరు దస్యుయోధులూ ప్రవేశిస్తారు. తుగ్రుడు వారికి కోటను చూపిస్తున్నాడు.)

తుగ్రుడు

అక్కడ కోటగోడను నిలువుఎత్తున ఎత్తు చేయాలి. ముందు అటునుండి పని ప్రారంభించండి.

దస్యుయోధులు

చిత్తం.

లోపాముద్ర

తుగ్రా! ఏమిటి చేస్తున్నావు?

తుగ్రుడు

కోటగోడలను ఎత్తు చేయిస్తున్నాను. మీ ఆర్యులు కోటదగ్గరకు చేరినట్లున్నారు.

ఋషుడు

(చప్పట్లుకొట్టి) ధన్యులు, ధన్యులు, నేనూ అదే చెప్ప బోతున్నాను.

విశ్వరథుడు

తుగ్రా! అది ఎవరిసేన? మహాతరంగంలాగా ముందుకు సాగుతున్నది?

తుగ్రుడు

అథర్వాణునిసేన.

లోపాముద్ర

చివరకు అథర్వాణులవారుగూడా యుద్ధరంగంలో దుమికారు. నా ఊహ నిజమయింది.

తుగ్రుడు

లోపాముద్రా! నీవు మొదటనే దస్యునాథునితో చెప్పావు. నిన్ను బంధించి దస్యునాథుడు పెద్ద పొరపాటు చేశాడు.

విశ్వరథుడు

(నవ్వి) ఇప్పటికి తెలిసిందా?

తుగ్రుడు

ఈమెను బంధించినంతమాత్రం చేత మీవాళ్ళు ఇలా ఉన్మత్తులవుతారని మాకేమి తెలుసు? మహా అథర్వాణులు ఇంతవరకు మాకు విరుద్ధంగా ఎప్పుడూ కత్తి ఎత్తి ఉండలేదు. ఈ రోజు వారే స్వయంగా యుద్ధానికి బయలుదేరారు. ఆ సేనలో అలాంటివారు ఇంకా చాలామంది ఉన్నారు.

లోపాముద్ర

ఈ యుద్ధంలో మా తరఫువారెవరెవరు పాల్గొన్నారు?

తుగ్రుడు

మీ గ్రామ గ్రామంలో క్రోధాగ్ని ప్రజ్వరిల్లిందట. వృద్ధులూ బాలకులూ అందరూ యుద్ధానికి బయలుదేరారట.

విశ్వరథుడు

బాగున్నది.

తుగ్రుడు

అశ్వారూఢుడై మహా అథర్వాణుడు గ్రామగ్రామానికీ పోయి లోపాముద్రను శంబరుడు బంధించి తీసుకొని వెళ్ళినాడని చెప్పి వచ్చాడట. మహా అథర్వాణుడు స్వయంగానే యుద్ధానికి వచ్చాడు. పక్థులతో సంధి చేసికొని దివోదాసు కూడా వస్తున్నాడట. శృంజయుడుకూడా వచ్చాడు. పురువులు సైన్యం పంపించారు.

ఋక్షుడు

అవును. నేనూ అదే చెప్పబోతున్నాను.

విశ్వరథుడు

తుగ్రా! మీ సేనలస్థితి ఎలా ఉన్నది?

తుగ్రుడు

(దైన్యంగా) మాకోటలు పడిపోతున్నవి. దివోదాసుడు ఆ వైపునుండి ముందుకు సాగివస్తున్నాడు.

లోపాముద్ర

తుగ్రా! అటు చూడు మీ దస్యురాజు వెనుకకు తప్పుకొన్నాడు. మహాఅథర్వణుల అశ్వాలను ఎవ్వరాపగలరు?

ఉగ్ర

నాన్నగారిస్థితి ఏమవుతుంది?

తుగ్రుడు

దస్యురాజునకు ఏమీ భయంలేదు. ఈ కోటలో ఉండి మనం పన్నెండుసంవత్సరాలవరకూ యుద్ధం చేయగలము.

లోపాముద్ర

(విశ్వరథునితో) కేవలం నీ గురువుగారూ, వశిష్ఠులూ ఇద్దరుమాత్రమే నన్ను వదలిపెట్టారు. మిగతావారి కందరికీ నామీద అమితదయ.

విశ్వరథుడు

భగవతీ! సప్తసింధు ప్రాంతానికి నీవు కంటిలోని పాపవు.

తుగ్రుడు

ఈమె వచ్చినదిమొదలు మాకు అన్నీ అపశకునాలే.

ఉగ్ర

(విశ్వరథునివంక చూచి దైన్యంగా) విశ్వరథా! నీవు నన్ను వదలి వెళ్లిపోతావా?

విశ్వేరథుడు

శాంబరీ! నీకు నా విషయంతప్ప ఇంకో విషయాం తోచదా?

ఉగ్ర

నీ విషయంతప్ప నాకింకా విషయ మేమున్నది?

(నేపథ్యంలో కోలాహాలం వినపడుతుంది)

తుగ్రుడు

ఈ కోలాహాల మేమిటి? ఎవరైనా లోపలకు వచ్చారా?

ఒక దస్యుడు

తుగ్రా! భైరవుడు కోటలోపలికి వచ్చాడు.

తుగ్రుడు

భైరవుడా!

విశ్వేరథుడు

భైరవుడా!

ఉగ్ర

(కోపంగా) ఈ కిరాతకుడు మళ్ళీ వచ్చాడా?

తుగ్రుడు

ఉగ్రా! ఏమిటి నీ మాటలు!! (యుద్ధవేషంలో భైరవుడు ప్రవేశిస్తాడు. అతని శరీరమంతా రక్తరంజితమై ఉంటుంది.) భైరవా! భైరవా! దయచేయి. అకస్మాత్తుగా ఇటు వచ్చావేం? సంగతి ఏమిటి?

భైరవుడు

(అందరివంకా క్రూరంగాచూసి) చాలా చెడువిషయం జరిగింది. ఉగ్రకాలునికి కోపం వచ్చింది. (పళ్ళు కొరికి)

నలువైపులనుండీ కోటలు పడిపోయిన వార్తలువస్తున్నవి. మన సేన నాశనమై పోతున్నది. మిడతలదండులాగా శత్రుసేన ముందుకు సాగివస్తున్నది.(తుగ్రుని చెయిపట్టుకొని) ఉగ్రశాలా! శాంతించు. ప్రసన్నుడవు కా. ఈ ఈ ఈ ఈ ఊ.

(భైరవుడు లోపాముద్రవంక మహాక్రూరంగా చూస్తున్నాడు. తుగ్రునితో కలసి వెళ్లిపోతాడు.)

లో పా ము ద్ర

వీడు మనుష్యుడేనా ? ఇలాంటివాణ్ణి నేను ఎక్కడా చూడలేదు.

వి శ్వ ర థు డు

భగవతీ ! మనం తప్పక విముక్తుల మవుతాము. నాకు పూర్తి విశ్వాస మున్నది,

లో పా ము ద్ర

ఉషాదేవి నాకు మాట యిచ్చింది.

ఋ క్షు డు

నేనుకూడా అదే అంటున్నాను. నాకు ఆకలిగా ఉన్నది. భోజనంచేసి వస్తాను.

(వెళ్ళిపోతాడు.)

ఉ గ్ర

(విశ్వరథుని గడ్డం పట్టుకొని) అయితే విశ్వరథా ! నీవు వెళ్లిపోతావా ? ఇక నాగతి ఏమిటి ? నాకుగూడా మార్గం చూపించు. నీ అభిప్రాయ మేమిటో నాకుగూడా చెప్పు.

లోపాముద్ర

అమ్మాయీ! కూర్చో. (అందరూ కూర్చుంటారు) అమ్మాయీ! ఇలా ఉన్మత్తురాలవు కాబోకు. మీజాతికీ మా జాతికీ మధ్య ఎంతో కాలంనుండి వైరభావ మున్నది. తండ్రి, భర్త ఇద్దరూ నీతో ఉండాలి అని ఆశిస్తే ప్రయోజనం లేదమ్మా!!

ఉగ్ర

(ఏడుపు కంఠంతో) ఎందువల్ల? ఇద్దరూ నాకు లభించే ఉపాయం లేదా?

లోపాముద్ర

సోదరీ! ఇటు భర్త, అటు తండ్రి ఇద్దరూ లభించడం దుర్లభం. శంబరమైత్రావరుణుల మధ్య సంధికుదరడం అసంభవం. ఒకవేళ అలా సంధి కుదిరినా నీవు ఇక్కడే ఉంటావు. విశ్వరథుడు భరతగ్రామం వెళ్లిపోతాడు.

ఉగ్ర

అయితే కౌశికుడు నన్ను తీసుకొని పోడా?

లోపాముద్ర

తీసుకొని పోతాడు. కాని ఇక్కడ నీవు రాజకన్యవు. అమ్మాయీ! భరతగ్రామంలో నీకు తగినస్థానం లభించదు.

ఉగ్ర

ఎందుకు లభించదు? నేను భరతులకు రాణి నవుతాను.

విశ్వరథుడు

అమాయకురాలా! నీకు తెలియదు. ఓ దేవా! మా గ్రామంలో ఉగ్రకు ఏమి స్థాన మివ్వను?

ఉగ్ర

(స్నేహపూరితంగా) నాకు ఏస్థానమూ అక్కర్లేదు. నీవు నా దగ్గర ఉంటే అంతేచాలు.

(తుగ్రుడు ప్రవేశించి కఠోరంగా ఉగ్రవైపు చూస్తాడు)

ఉగ్ర

ఏమిటి ?

తుగ్రుడు

పని ఉన్నది.

విశ్వరథుడు

కొత్త సమాచారం తెలియవచ్చిందా ? తుగ్రా !

తుగ్రుడు

లేదు.

ఉగ్ర

నే నిప్పుడే వస్తాను. కౌశికా !

(తుగ్రునితో వెళ్ళిపోబోతుంది)

లోపాముద్ర

తుగ్రుడు ఇంత గంభీరంగా ఉన్నాడేం ?

విశ్వరథుడు

ఏదో విశేష మున్నది. భగవతీ ! మనం విముక్తులమైతే

ఈ శాంబరి గతి ఏమిటి ? ఆమెహృదయం కుసుమ కోమలం. నేను ఆమెను వదలి వెళ్లితే ఆమెహృదయం బ్రద్ద లవుతుంది.

లో పా ము ద్ర

నేనుకూడా అదే ఆలోచిస్తున్నాను.

వి శ్వ ర థు డు

(కటువుగా) మనం విశుద్ధహృదయులమైన ఆర్యులము. రంగుభేదం కనబడగానే మనలో గడ్డకట్టుకొనిఉన్న స్వజాత్యభిమానం జాగృత మవుతున్నది. భగవతీ! ఎంతకాలమో అగస్త్యులవారి శుశ్రూష చేశాను. ఈవర్ణభేదరహస్యం ఇంత వరకూ నాకు బోధపడలేదు.

లో పా ము ద్ర

పుత్రకా! ఆ రహస్యం నాకు తెలుసును. ఈ జాత్యభిమానంవల్లనే ఇంతవరకూ మనలో విశుద్ధత నిలవగలిగింది. ఇక్కడ శంబరుడు నిన్ను అల్లునిగా గౌరవంగా స్వీకరించాడు. అక్కడ ఘోషామాత శాంబరిని దాసిగాకూడా స్వీకరించదు.

వి శ్వ ర థు డు

అయితే, భగవతీ! వరుణదేవుని ఋత మిదేనా? ఇదేనా మన మహర్షులు చూపించిన సత్యం? నేను వరుణుని ప్రార్థించి ప్రార్థించి అలసిపోయినాను. కాని నా మనస్సునకు శాంతి లభించడంలేదు. వేరువేరు రంగులలో వేరువేరు సత్యాలూ, వేరువేరు ఋతాలూ ఎలా ఉండగలుగుతవో బోధపడడం లేదు.

లో పా ము ద్ర

విశ్వరథా! నేటివరకు మహర్షులుకూడా ఏస్థితిని దర్శించలేదో ఈ నాడు ఆస్థితిని నీవు దర్శిస్తున్నావు. ఋతం ఒక్కటే.

సత్యంగూడా ఒక్కటే. (దీనంగా) కాని ఈ రహస్యాన్ని బోధపరచుకొనే దెవరు ?

విశ్వరథుడు

గురువుగారు ఈ రహస్యాన్ని తాము తెలుసుకోడం లేదు. ఇంకొకరిని తెలుసుకోనివ్వడం లేదు.

లోపాముద్ర

అది మన దురదృష్టం. పద. వెళ్ళి భోజనం చేద్దాము. ఆ ఋక్షుడు ఏమిచేస్తున్నాడో.! (కోట బయటకు చూచి) యుద్ధం శాంతించినట్లున్నది.

విశ్వరథుడు

ఆ పర్వతానికి అవతల భాగంలో యుద్ధం జరుగుతున్నది. మనకు కనపడటంలేదు.

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

(ఉగ్ర భయంతో వ్యాకులంగా ప్రవేశిస్తుంది)

బాప్ రే! (కన్నీరు తుడుచుకొని) ఉగ్రకాలా! నా కౌశికుని బలిగా స్వీకరించ తలచావా ? (పిచ్చిదానిలాగా జుట్టు లాగుకుంటుంది) ఉఫ్! కౌశికుని కాల్చివేస్తారా?అయ్యో! నా కళ్ళముందు! భైరవా! భైరవా! ఎంత దుర్మార్గానికి తలపడ్డావు? ఏమిచేయను? ఎవరితో చెప్పను? కౌశికా! కౌశికా!!

(దాగి ప్రవేశిస్తుంది)

దాగి

(నెమ్మదిగా) వస్తున్నాడు.

ఉగ్ర

వెళ్ళి త్వరగా పిలుచుకొనిరా ఓ కౌశికా! (దాగి వెళ్ళిపోతుంది)

(విశ్వరథుడు వ్యాకులంగా ప్రవేశిస్తాడు)

విశ్వరథుడు

శాంబరీ! ఇంతలోనే ఏమిపని వచ్చింది? తొందరగా పిలిపించావు?

ఉగ్ర

(విశ్వరథుని ఆలింగన చేసుకొని) కౌశికా! కౌశికా! పూర్తి అయింది. పూర్తి అయింది.

విశ్వరథుడు

(ఉగ్రభుజంమీద చెయివేసి) ఏమిటి ఉగ్రా! సంగతేమిటి?

ఉగ్ర

(ఏడుస్తూ) ఉగ్రకాలుడు బలి కోరాడట.

విశ్వరథుడు

బలియా? ఎవరిని?

ఉగ్ర

నిన్ను, లోపాముద్రను, ఋక్షుని.

విశ్వరథుడు

(ఉలిక్కిపడి) బలిగానా? మమ్మలినా?

ఉగ్ర

ఉగ్రకాలుడు ఆకాశవాణిని వినిపించాడు. రేపు ఉదయంలోపల మిమ్మల్ని బలిగా సమర్పించకపోతే......

విశ్వరథుడు

సమర్పించకపోతే?

ఉగ్ర

ఈ కోట శత్రువుల చేతిలో పడిపోతుందట. శంబరుడు చంపివేయబడతాడట.

విశ్వరథుడు

ఓః! రేపు మమ్మల్ని కాల్చివేస్తారన్నమాట. (కొంచెం శరీరం వొణుకుతుంది. శిరస్సుమీద చెయ్యి పెట్టుకొని ఆలోచిస్తాడు) రేపు ఉదయమా? (పళ్ళు కొరికి) ఆఖండాలుడు వైరం సాధిస్తున్నాడు. నీకు ఎవరు చెప్పారు?

ఉగ్ర

నాకా! నేను అక్కడనే ఉన్నాను. నన్ను మా అమ్మగారి కుటీరంలో బంధించి వేశారు. దాగి నన్ను తప్పించింది. అందువలన ఇటు పరుగెత్తుకొని వచ్చాను. నే నేంచేయను? కౌశికా! కౌశికా! నే నేంచేయను? (వెక్కి వెక్కి ఏడుస్తుంది)

విశ్వరథుడు

శాంబరీ! దుఃఖించకు. ఇది దుఃఖించే సమయం కాదు. (గంభీరంగా) విను.

ఉగ్ర

ఏమిటి?

విశ్వరథుడు

తుగ్రుడు మమ్మల్ని రక్షించలేడూ?

ఉగ్ర

తుగ్రుడా! (ఆలోచించి) అది సరే, ఒకపని చేయనా? మీరు పారిపోయే ఉపాయం ఆలోచించనా?

విశ్వరథుడు

ఆ పనిచేస్తే నీ కెంతో కృతజ్ఞులంగా ఉంటాము.

ఉగ్ర

కృతజ్ఞులుగానా ?

విశ్వరథుడు

చూడు, కోట నలువైపులా మాసేన వ్యాప్తమై ఉన్నది. ఒక్కసారి ఈ కోటలోనుండి బయటపడితే మేము విముక్తులమైనట్లే.

ఉగ్ర

లోపాముద్రా, నీవూ వెళ్లిపోతారు; మరి నేనో ?

విశ్వరథుడు

తరువాత మళ్లీ కలుసుకుందాం.

ఉగ్ర

కాదు, కాదు కౌశికా ! నన్నుగూడా మీతో తీసుకుని పొండి.

విశ్వరథుడు

నావెంటవస్తే నీకు ఎంత దుఃఖం కలుగుతుందో ఆలోచించావా ?

ఉగ్ర

కౌశికా ! నీవుంటే నాకింకా దుఃఖ మేమిటి ?

విశ్వరథుడు

(కళ్ళవెంట కన్నీరు కారుతుంది) ఉగ్రీ ! నీవు దస్యుకన్యవు. భరతశ్రేష్ఠునిగృహంలో ఉండి నిర్వహించగలవా ?

ఉగ్ర

నన్ను వదలవుగదా ?

(నిశ్చయపూర్వకంగా) అయితే ఉగ్రా! మమ్మల్ని రక్షించు. నిన్ను బ్రతికిఉండగా వదలను. మాపితృదేవతలు సాక్షి. నిన్ను దుఃఖపెట్టను. దేవా! నన్ను వచనబద్ధుణ్ణిచేయి.

ఉగ్ర

కౌశికా! (ఆనందంతో కౌశికుని మద్దుపెట్టుకుంటుంది) నేను ప్రాణాలకు పూర్వమే మిమ్మల్ని వదలిస్తాను.

విశ్వరథుడు

తప్పకుండానా ?

ఉగ్ర

నేను జీవించిఉంటే ? మీరంతా సిద్ధంగా ఉండండి.

విశ్వరథుడు

భగవతినీ,ఋషునీ ఇక్కడకు పంపమని దాగితో చెప్పు.

(ఉగ్ర వెళ్ళిపోతుంది)

విశ్వరథుడు

ఇదేమి విచిత్రం? భరతులపుణ్యం లుప్తమైపోయిందా? ఇంద్రా! దేవాధిదేవా! వృషభశ్రేష్ఠా! శృంగాలతో శత్రువులను సంహరించవేమి? (చేతులు జోడించి) మీ మహా ఘోషతో ఆర్యుల్ని ప్రోత్సహించవేమి? సర్వదర్శీ! శత్రువుల సేనలను సంహరించవేమి? (లోపాముద్ర ప్రవేశించి చూస్తూ ఉంటుంది) మహాబాహూ! ధనుర్ధరా! రథం మీద ఎక్కి నన్ను రక్షించడానికి దయచేయండి. వృత్రుని

సంహరించినట్లు వజ్రాయుధంతో శత్రువులను సంహరించండి. (ఆకాశంవంక చూస్తూ ఉండిపోతాడు. లోపాముద్ర ప్రశంసా పూర్వకంగా అతని ముఖంవంక చూస్తుంటుంది. ఋక్షుడు ప్రవేశిస్తాడు)

లో పా ము ద్ర

పుత్రకా ! నీవు రాజువు కావు. ఋషివి.

ఋ క్షు డు

నేనూ అదే అనబోతున్నాను.

వి శ్వ ర థు డు

(ఆకాశం వంక చూస్తూ) ఇంద్రుడు నా ప్రార్థనను ఆలకిస్తున్నాడు. అదుగో ఇంద్రుడు యుద్ధసంసిద్ధు డవుతున్నాడు. శంబరునిశిరస్సు ధూళిలో పడిపోతున్నది. (స్మృతి తెలిసి, కళ్లు తెరుస్తాడు) భగవతీ ! భగవతీ ! నేటితో మన జీవితం అంత మవుతుంది.

లో పా ము ద్ర

ఎందువల్ల ?

వి శ్వ ర థు డు

రేపు ఉదయం భైరవుడు మనల్ని ఉగ్రకాలునికి బలిగా సమర్పించ బోతున్నాడు.

లో పా ము ద్ర

బలిగానా ?

ఋ క్షు డు

నన్నుగూడానా ?

విశ్వరథుడు

రేపు మన ముగ్గురినీ భస్మంచేసి శివలింగానికి లేపనం చేస్తాడట.

లోపాముద్ర

ఎవరన్నారు ?

విశ్వరథుడు

శాంబరి స్వయంగా విన్నది. శాంబరిని ఒక కుటీరంలో బంధించారు. కాని మెల్లగా ఆమె తప్పించుకొని వచ్చింది.

ఋక్షుడు

ఏమిటోయి నీ మాటలు ? నన్ను వారు చంపుతారా ? నిజమేనా ? ఎగతాళిమాటలు అంటున్నావా ? నాలాంటివాణ్ణి, సజ్జనుణ్ణి చంపేవాం డెవడు ?

విశ్వరథుడు

ఇది ఎగతాళికి సమయం కాదు. (కఠోరంగా) రేపు ఉదయం మనం ముగ్గురం ఉగ్రకాలునికి బలిగా సమర్పింపబడతాము.

ఋక్షుడు

నేను చస్తానా ? చస్తానా ? చావను, చావను.

లోపాముద్ర

(విశ్వరథుని తలమీాద చేయివేసి) పుత్రకా ? భయపడవలసిన అవసరమేమీా లేదు.

ఋక్షుడు

రేపు ఉదయంలోపల గురువుగారు వస్తారా ?

లోపాముద్ర

నే ననేది అదికాదు. అయినా మనం ఎందుకు భయపడాలి ? మన ఆహుతిద్వారా దేవతలు ఆర్యులను బలవంతులనుగా చేయదలచు కొన్నారేమో !

ఋషుడు

అయ్యో !

విశ్వరథుడు

ఘోషామాత వడ్చివడ్చి ప్రాణాలు వదలిపెడుతుంది.

లోపాముద్ర

విశ్వరథా ! మనం బలికాకపోతే ఆర్యులు విశ్వవిజేత లెట్లా అవుతారు ? రుధిరప్రవాహాలలోనుండియే పరాక్రమ ప్రవాహాలు ప్రవహిస్తవి. కాని కనీసం నీవైనా ఇక్కడనుండి తప్పించుకో గలిగితే బాగుండును.

విశ్వరథుడు

ఒక్క ఆశ ఉన్నది. శాంబరి మనం పారిపోడానికి తగిన ఉపాయాన్ని అన్వేషించడంకొరకు పోయింది. ఆమెగూడా మనతో వస్తుంది.

ఋషుడు

పారిపోదామా ? ఉపాయం బాగానే ఉన్నది.

లోపాముద్ర

శాంబరి ఏమిఉపాయం ఆలోచిస్తుంది ? ఆమె హృదయం ఎంతో సున్నితమైనది.

విశ్వరథుడు

నాకుగాను శాంబరి ఏమైనా చేస్తుంది.

లోపాముద్ర

అవును. నిజమే, ప్రేమించడం వేరు. ఇలాంటి వ్యవహారాలు వేరు.

ఋక్షుడు

నేనుగూడా మార్గం వెదకుతాను, (లేచినిల్చుంటాడు.)

విశ్వేరథుడు

నీవు మాట్లాడకుండా కూర్చో.

ఋక్షుడు

నేనూ అదే అనుకుంటున్నాను. ఒకవేళ వాళ్ళు నన్ను చంపివేస్తే మా అమ్మ నాన్న ఏమిచేస్తారో? ఎంతగా దుఃఖిస్తారో? (తలమీద చెయ్యిపెట్టుకొని) నేనేమి చేయను?

లోపాముద్ర

భగవాన్! సవితృదేవతా! పునర్దర్శనభాగ్యం కలుగజేసి మమ్మల్ని కృతార్థులను చేయవా? (అస్తమిస్తున్న సూర్యబింబాన్ని చూస్తుంది) సూర్యదేవతా! మా అశ్వాలకు గతి నిమ్ము. మా రథాలతో భూమిని కంపింపజేయుము. ఎత్తుగా ఎగురుతున్న మా పతాకలను రక్షించుము. రక్షించుము. సూర్యదేవతా! శత్రువుల కళ్ళలో అంధకారాన్ని నింపుము. సవితృదేవతా! (అచేతనావస్థలో మంత్రాలను పఠిస్తుంది) మా బాహువులు బలంగానే ఉన్నవి. మేము దుర్జేయులము. వరుణరాజా! యుద్ధంలోనికి దిగి మాకు విజయాన్ని ప్రసాదించు. (నవ్వుతూ) విశ్వేరథా! రథాన్ని అధిరోహించి సూర్యదేవత వస్తాడు. అస్తమిస్తూ ఆయన ఎలా నవ్వుతున్నాడో

చూడు. జీవించినా, మరణించినా, పుత్రకా! విజయం మనదే.
(దూరంగా ఎరుపురంగు ఆకాశమంతటా వ్యాపిస్తుంది)

ఋక్షుడు

(ఆకాశం వైపుకు చెయి జాచి) ఇదేమిటి?

విశ్వరథుడు

(లోపాముద్రకు చూపించి) భగవతీ! దేవతలు ప్రార్థనను ఆలకించారు. ఈ దగ్గరనున్న అరణ్యాలలో అగ్ని అంటుకొన్నది.

లోపాముద్ర

ఈ శంబరునికోటకు దగ్గరగానే మైత్రావరుణులు ఉన్నారన్నమాట. అటు చూడు. వరుణదేవుడు స్వయంగానే రక్తరంజితమైన వస్త్రాలను ధరించాడు. రేపు ఉదయంలోపల గురువుగారు ఇక్కడకు రావచ్చును.

విశ్వరథుడు

నాకు అలాంటి ఆశలేదు. పన్నెండు సంవత్సరాల వరకూ ఈ కోట పడిపోదని తుగ్రుడు చెప్పలేదా?

లోపాముద్ర

వజ్రధారియగు ఇంద్రుడే ఆక్రమణ ప్రారంభిస్తే అన్నీ సంభవమే.

(తుగ్రుడు ప్రవేశిస్తాడు.)

తుగ్రుడు

విశ్వరథుడిక్కడ ఉన్నాడా?

లోపాముద్ర

ఏమి? కొత్త సమాచారం ఏమైనా ఉన్నదా?

తుగ్రుడు

ఏమీ లేదు. మీరు ముగ్గురూ ఇక్కడే ఉన్నారుగదా?

లోపాముద్ర

(నవ్వి) ! అవును ఉన్నాము. పనిఏమైనా ఉన్నదా ?

తుగ్రుడు

(క్రూరంగా) అటు చూచారా ? (దావానలంవైపు చూపిస్తాడు.)

విశ్వరథుడు

అది ఏమిటి ?

తుగ్రుడు

అది ఏమిటా ? మీ గురువు మా గ్రామాలను తగులబెడుతున్నాడు. అగస్త్యుడు రేపు ఇక్కడకు (కోటక్రింది అగడ్తను చూపించి) చేరుకుంటాడు.

విశ్వరథుడు

రేపేనా ? వారి దర్శనంచేసి కృతార్థుడ నవుతాను.

తుగ్రుడు

రేపు వారిని దర్శించ వచ్చును. (కంఠం వొణుకుతుంది) అవును. నిజమే.

లోపాముద్ర

(తియ్యని స్వరంతో) తుగ్రా ! కౌశికుడంటే నీకు చాలా ప్రేమగదూ ?

తుగ్రుడు

మాకు ఈ పరస్పర వైరభావం లేకపోతే—

విశ్వరథుడు

తుగ్రా! నా విషయంలో నీవు తండ్రిలాగా ప్రవర్తించావు. నేను నిన్ను ఎప్పుడూ మరచిపోలేను.

తుగ్రుడు

(ఆదరంగా) కౌశికా! నిన్ను కూడా నేను మరచిపోలేను. నిజంగా నిన్ను నా పుత్రునిలాగానే భావించాను. కాని, కాని......ఉగ్రకాలుడు అందరికంటే బలవంతుడు. ఆయన ఆజ్ఞను ఎవరు ఉల్లంఘించగలరు?

విశ్వరథుడు

తుగ్రా! ఇటు రా. తిరిగి మనం ఎప్పుడు కలుసుకొంటామో! (ఇద్దరూ ఒకరినొకరు ఆలింగనం చేసుకొంటారు)

తుగ్రుడు

(ఖేదంగా) లోపాముద్రా! నీ విక్కడి కెలా వచ్చావు? ఎందుకొచ్చావు?

లోపాముద్ర

నేనా? తుగ్రా! జన్మించినదాదిగా నే నింతవరకు ఎవ్వరినీ ద్వేషపూరిత దృష్టితో చూడలేదు. అలా మాట్లాడుతున్నావేం?

తుగ్రుడు

నీ రాకవల్లనే మాకీ విపత్తు సంభవించింది.

లోపాముద్ర

అందుకు నే నేమిచేయను? నన్ను శంబరుడు బంధించి తెచ్చాడు. నన్ను బంధించడం వలన నీ కేమీ ప్రయోజనముండదని అనేకసార్లు చెప్పాను. అతడు వినలేదు, తుగ్రా!

నీవు చాలా తెలివైనవాడవు. శంబరుని హృదయం లాంటి స్నేహాపూరిత హృదయం ఇంకొకరి కుండదు. అయినా మమ్మల్ని చంపివేయడానికి మీా రెందుకు ప్రయత్నం చేస్తున్నారో అర్థం కావడంలేదు.

తుగ్రుడు

(ఉలిక్కిపడి) చంపివేయడానికా ? ఎవరన్నారు ?

లోపాముద్రి

నాకు తెలుసును. రేపు మమ్మల్ని మీారు బలిగా సమర్పించబోతున్నారు. మేము మీాకు ఏమి అపకారం చేశామో చెప్పండి. విశ్వరథుని ఆశ్రమంలో శంబరుణ్ణి నేను మృత్యుముఖంలోనుంచి తప్పించాను. ఇక్కడ విశ్వరథుడు ఎంతమందికి ప్రాణదానం చేశాడు ? శాంబరి విశ్వరథుని ఎంతగా ప్రేమిస్తున్నది ? విశ్వరథుడంటే నీకు పుత్రవాత్సల్యం కదా ? శంబరుడు నన్ను పుత్రికవలె ప్రేమిస్తున్నాడు. మరి మమ్మల్ని ఎందుకు మీారు చంపివేయదలచుకొన్నారో అర్థం కావడంలేదు.

తుగ్రుడు

ప్రభువున కనుకూలంగా నడవడం నా ధర్మం.

లోపాముద్రి

ఈ రోజున శంబరుడు ఇక్కడేఉంటే నా వొంటిమీాద ఈగనుగూడా వాలనిచ్చేవాడా ?

తుగ్రుడు

(తలమీాద చెయ్యిపెట్టుకొని) నేనేమి చేయను ?

విశ్వరథుడు

నన్ను చంపివేస్తే శాంబరి జీవించదు.

తుగ్రుడు

అవును.

లోపాముద్ర

మరి ?

తుగ్రుడు

ఆజ్ఞ.

విశ్వరథుడు

ఎవరి ఆజ్ఞ ? భైరవుని ఆజ్ఞయేనా ?

తుగ్రుడు

ఉగ్రకాలుని... ...

లోపాముద్ర

వా రిద్దరికీ భేద మేమిటి ?

(తుగ్రుడు మాట్లాడడు)

లోపాముద్ర

(మధురస్వరంతో) మా రక్తస్రవంతి ప్రవహించినప్పుడు ఆ స్రవంతిలో మునిగి మరణించేవారు ఎంతమంది ఉంటారో మీకు తెలియడంలేదు. బాగా ఆలోచించు. మేమే బలిగా సమర్పింపబడితే మహాఅథర్వణులూ, అగస్త్యులూ మీ విషయంలో ఎంత తీవ్రత నవలంబిస్తారో ఆలోచించు.

తుగ్రుడు

(ఖేదంగా) అదంతా నాకు తెలుసును. కాని నే నేమి చేయగలను ?

విశ్వరథుడు

ఈ కోటకు రక్షకుడవు నీవేకదా ? మమ్మల్ని ఎక్కడనైనా దాచిపెట్టలేవా ? మమ్మల్ని కోటబయటకు చేర్చు.

తుగ్రుడు

ఉగ్రకాలుని ఆజ్ఞను ఉల్లంఘించగలనా ?

లోపాముద్ర

మమ్మల్ని నీవు హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావు. మేము ఉగ్రకాలునికి అప్రియులం ఎలా అవుతాము ?

విశ్వరథుడు

తుగ్రా ! నీకు ఇక్కడి దోవలన్నీ తెలుసు. అర్ధరాత్రి మమ్మల్ని ఇక్కడనుండి వెళ్ళిపోనీ. (రెండు చేతులతో తుగ్రుని చెయిపట్టుకొని) ఉగ్రకాలునికి ఏవిధంగానూ కోపంరాదు.

తుగ్రుడు

నే నేమిచేయను ? కోటలోని జనమంతా మీమీద కోపంగా ఉన్నారు. ఈ విషయం ఎవరికైనా తెలిస్తే నా ఎముకలుగూడా మిగలవు.

లోపాముద్ర

తుగ్రా ! ఎంతోమంది అసురులు నన్ను మాతృదేవతనుగా భావిస్తున్నారు. శంబరుడు జీవనదాత్రినని నన్ను గౌరవిస్తున్నాడు. దేవతలకు, మానవులకు, అసురులకు అందరికీ నేను ఇష్టురాలనే. అదిగాక నేను నిరాయుధురాలను. స్త్రీని

నన్నుగూడా నీవు బాధిస్తావా ? చంపి వేస్తావా? బ్రతికి ఉండగానే తగులబెడుతావా?(హృదయాన్ని ద్రవింపజేసే స్వరంతో) తుగ్రా! నీవు వీరుడవు. నీవు నా శిరస్సును ఛేదిస్తావా ? నా శిరోజాలను పట్టుకొని ఉగ్రకాలునికి నన్ను బలిగా సమర్పిస్తావా ?

తుగ్రుడు

(వ్యాకులభావంతో) లోపాముద్రా ! లేదు——లేదు.

లోపాముద్ర

(తొందరగా) నీవు వీరుడవు, స్వామిభక్తుడవు. మమ్మల్ని వెళ్లిపోనిస్తే ఆ విషయాన్ని నిన్ను అడిగే వారెవరు ? ఈ విషయాన్ని కనుక్కొనే వారెవరు? ఈ విషయం విని ఎవ్వరూ బాధపడరు. ఒక్క భైరవుడుమాత్రం విచారించవచ్చును. ఎవరిని అతడు అనుభవించలేకపోయినాడో ఆస్వరూపాన్ని నశింపజేయడానికి పూనుకున్నాడు.

తుగ్రుడు

అవును, నిజమే.

లోపాముద్ర

అయితే, అలాంటి దుర్మార్గునికి నీవుగూడా సహాయం చేస్తావా ?

(ఉగ్ర పరుగెత్తుకుంటూ వస్తుంది.)

ఉగ్ర

(సంతోషంగా) కౌశికా !

లోపాముద్ర

ఉగ్రా ! తొందరపడకు. తుగ్రా ! మాతోబాటు ఈ అమాయికురాలినిగూడా సంహారిస్తావా ?

తుగ్రుడు

(వ్యాకులంగా) లేదు—లేదు.

లోపాముద్ర

అయితే మా మనవిని అంగీకరించు.

తుగ్రుడు

లోపాముద్రా! నీలో ఏదో ఇంద్రజాల మున్నది. (నిశ్చయంగా) నేను మిమ్మల్ని తప్పక రక్షిస్తాను.

ఉగ్ర

నిజమేనా? నా కౌశికుణ్ణి రక్షించు. అందుకు మార్గము నేను వెదకి అట్టిపెట్టాను.

తుగ్రుడు

నాకు అన్నిమార్గాలూ తెలుసును. నేను తప్పక మిమ్మల్ని రక్షిస్తాను. (నలువైపులా చూచి) తయారుగా ఉన్నారా?

విశ్వరథుడు

ఆ, తయారుగా ఉన్నాము.

ఉగ్ర

నేనుగూడా వీరితో కలసి వెళ్లుతాను.

తుగ్రుడు

అదేమిటి?

ఉగ్ర

కౌశికు డెక్కడకు వెళ్ళితే నేనుగూడా అక్కడకు వెళ్ళవలసిందే.

తుగ్రుడు

ఆలోచించుకో అమ్మా! తరువాత పశ్చాత్తాప పడతావు. విశ్వరథా! ఏమిటి ఈ పని? శంబరకన్యను దాసినిగా చేయడానికి తీసుకొని పోతున్నావా?

విశ్వరథుడు

తుగ్రా! నా మాటను విశ్వసించు. నేను భరత జనపతిని అయితే శంబరి రాజమహిషి అవుతుంది.

తుగ్రుడు

రాజమహిషి!! ఉగ్రకాలుడే సాక్షి.

విశ్వరథుడు

లోపాముద్ర సాక్షి, దేవతలు సాక్షి.

(లోపాముద్ర అంగీకారాన్ని తెలియజేస్తుంది)

తుగ్రుడు

ఇదేమిటి? (కోటకింద చూస్తాడు)

విశ్వరథుడు

(చూచి) అథర్వాణులసేన దగ్గరకు వస్తున్నది.

లోపాముద్ర

నడవండి.

తుగ్రుడు

నడవండి.

ఉగ్ర

ఇదేమిటి? (కింద్రిదనుండి అగ్నిజ్వాలలు కనపడతవి)

విశ్వరథుడు

(ఉగ్రభుజంమీద చెయివేసి) భయపడకు. కింద అడవులు తగలబడిపోతున్నవి.

తుగ్రుడు

మా దస్యులు వేలకువేలుగా చచ్చిపోతున్నారు. (సంశయంగా నిలబడతాడు) నేను మిమ్మల్ని రక్షిస్తున్నాను. కాని ఉగ్రకాలుడు......

లోపాముద్ర

తుగ్రా! దయార్ద్రహృదయుణ్ణి దేవతలు ఎప్పుడూ కష్టపెట్టరు. ముందుకు పద.

తుగ్రుడు

సరే, నెమ్మదిగా నడవండి. (ఆగిపోతాడు)

దస్యుగణం

(నేపథ్యంలో) ఈ. ఈ. ఈ. ఊ.

(పరుగెత్తుకొని వస్తున్న వారి కాళ్ళచప్పుడు)

ఉగ్ర

ఓః. (కళ్ళు మూసుకుంటుంది)

ఋక్షుడు

(ఏడుపు స్వరంలో) ఓ దేవా!

విశ్వరథుడు

ఎవరు ? (సాహసంగా ముందుకు వస్తాడు. భైరవుడూ కొంతమంది అసురులూ వచ్చి ముగ్గురు ఆర్యుల్ని బంధిస్తారు. తుగ్రుడు దూరంగా నిలబడి ఉంటాడు. భైరవుడు క్రూరంగా లోపాముద్రవైపుకు చూస్తాడు.)

భైరవుడు

నేను భైరవుణ్ణి. (విజయగర్వంతో) ఉగ్రకాలుడు మిమ్మల్ని పిలువనంపించాడు. (ఉగ్ర తీవ్రంగా భైరవునివంక చూస్తుంది) ఓహో! శాంబరీ! నీవు గూడా ఇక్కడే ఉన్నావా?

ఉగ్ర

(ఉగ్ర ఈ ఈ అంటూ తొందరగా వెళ్ళిపోతుంది)

భైరవుడు

తుగ్రా! వీరిని తీసుకొనిరా.

తుగ్రుడు

(క్రోధంగా) రాను.

తెరపడుతుంది.

—

•

# నాలుగో దృశ్యం

(రెండో రోజు తెల్లవారుజాము సమయం. పశుపతి ఉగ్రకాలుని మందిరంమధ్య దూరంగా ఉగ్రకాలుని నల్లని లింగం ఉంటుంది. ఎదుట ఒక స్తంభానికి లోపాముద్ర కట్టివేయబడి ఉంటుంది. ఆమెకు దగ్గరగా రెండు స్తంభాలకు వేరు వేరుగా ఋక్షుడూ, విశ్వరథుడూ కట్టివేయబడి ఉంటారు. విశ్వరథ లోపాముద్రలు నిరాశగా ఉంటారు.)

విశ్వరథుడు

లేదు, మేము మరణించము. ఎప్పటికీ మరణించము. వరుణదేవుడు ఎన్నోసార్లు నాకు మాట యిచ్చాడు... ... ... వరుణదేవుడు నా కంటికి కన్పిస్తున్నాడు... ... పితృదేవతలను నేను చూస్తున్నాను... వారు విశ్వవిజేతలు... పర్వతాలనూ నదులనూ దాటి, దస్యుగణాన్ని నాశనంచేసి, దిక్కులు పిక్కటిల్లేటట్లుగా ఇంద్రునికి జయఘోష పెడుతూ అదిగో, ఆర్యసైన్యం కన్పిస్తున్నది. ఒకరివెనుక ఒకరు ఆర్యవీరులు ముందుకు సాగి వస్తున్నారు. వారి మెడలలో విజయహారాలూ, వారి నేత్రాలలో ఉల్లాసమూ, వారి హృదయాలలో దివ్యప్రేరణా నిండి ఉన్నది. జగత్తంతా వారి పాదాలకు నమస్కరిస్తున్నది. (ఆకాశంవైపు దృష్టి సారిస్తాడు.)

లోపాముద్ర

ఇంకా ఏమి కనపడుతున్నది ?

విశ్వరథుడు

(పెద్దగా) సత్య తపో ఋతాల త్రివేణి యిందుకు సాగి వస్తున్నది. భగవతీ! మీలాంటి పుణ్యాంగనలూ, పుణ్య పురుషులూ తపస్సువలన జగత్తును పునీతంచేస్తూ, ప్రజలను ఉద్ధరిస్తూ కన్పిస్తున్నారు. (శిథిలకంఠంతో) మీవంటివారు దర్శించిన అమరమంత్రాలు కల్పాంతంవరకూ ఆర్యసంతానానికి పథప్రదర్శనంచేస్తూ ఉంటవి. (నిద్రమత్తు వస్తుంది, మేల్కొని) ఏమిటి? ఏమిటి నేను మాట్లాడుతున్నాను? భగవతీ! క్షమించు.

లోపాముద్ర

పుత్రకా! నీ వాణిలో వరుణుడే మాట్లాడుతున్నాడు.

(కొంత సమయం గడుస్తుంది. విశ్వరథునికి నిద్రమత్తు వస్తుంది. తల వాలుస్తాడు. లోపాముద్ర విశ్వరథునివంక చూస్తుంటుంది)

విశ్వరథుడు

(మత్తులో) అగ్ని! జమదగ్ని!

లోపాముద్ర

విశ్వరథా! విశ్వరథా! (ప్రేమపూరిత నయనాలతో చూస్తుంది)

విశ్వరథుడు

భగవతీ! క్షమించు. ఏమిటో నిద్రమత్తులాగా వచ్చింది.

లోపాముద్ర

విశ్వరథా! తంద్రాపూరితమైన పృథ్వీమీద రాత్రి వ్యాపించి ఉన్నది. అటుచూడు. అరణ్యాలుగూడా నిద్రబో

తున్నవి. పక్షులూ, గిరులూ, వృక్షాలూ అన్నీ నిద్రబోతున్నవి. అలసిపోయిన చంద్రుడు అస్తమించబోతున్నాడు. కొద్ది సేపటిలో ఉషాదేవి దర్శన మిస్తుంది. మనం తోడుతోడుగా యమసదనానికి చేరుతాము. చూడు ఆకాశంలో వేలకొలది నయనాలు ఎలా మిణుకు మిణుకుమంటున్నవో అవి మనకు స్వాగతం చేయబోతున్నవి.

విశ్వరథుడు

ధన్యుడను. మీతోగూడా కలసి యమసదనం చేరుకొనేభాగ్యం నాకు లభించింది.

లోపాముద్ర

విచిత్రమైన సంఘటన!! ఈ విధంగా శంబరునికోటలో మనమిద్దరమూ తోడు తోడుగా ఉగ్రకాలునికి బలిఅవుతున్నాము.

విశ్వరథుడు

అదేస్వప్నం నేను చూచాను.

లోపాముద్ర

విశ్వరథా! నీకు మన మొదటి కలయికనాటి మాటలు జ్ఞాపకం ఉన్నవా ?

విశ్వరథుడు

భగవతీ !

లోపాముద్ర

ఏమిటి ? (వెర్రినవ్వు నవ్వి) చెప్పు.

విశ్వరథుడు

ఏమిచెప్పను? త్వష్ట మిమ్మలిసి ఎంత అద్భుతంగా

చిత్రించాడు! మిమ్మల్ని చూచిన తరువాత నాకు క్రొత్త దృష్టి ఏర్పడింది. భగవతీ……………మీరు ఆకాశాన్నుండి దిగివచ్చిన దేవిలాగా దేదీప్యమానంగా ఉన్నారు. మీమాట లలోనాకు దేవవాణి స్ఫురించింది. మీ పదచిహ్నాలలోనుండి శుద్ధిప్రవాహాలు వెల్లివిరిసినవి.

లోపాముద్ర

అవును కౌశికా! నేను పోయినచోటనల్లా పురుషులకు నూతనదృష్టి ఏర్పడింది. (నవ్వి) నేను కష్టపెట్టినన్ని హృదయాలను ఇంకెవ్వరూ కష్టపెట్టిఉండరు.

విశ్వరథుడు

కష్టపెట్టారా? వరుణుడు నన్ను జీవించనిస్తే మీరు చెప్పిన ఒక్కొక్కమాటకొరకు నూరుసార్లు బలి అవుతాను. మీరుదేవలోకపుపరిమళాన్ని దగ్గరబెట్టుకొని తిరుగుతున్నారు. నా మనుష్య హృదయాన్ని ఎలా తెలియపరచను?

లోపాముద్ర

నేనుగూడా దేవతను కాను. మానవినే. అందువల్లనే నన్ను అందరూ ప్రేమిస్తున్నారు.

విశ్వరథుడు

అవును, మిమ్ము చూచినవారల్లా తన జీవితపుటాశ మూర్తీభవించి సంచరిస్తున్నదని భావిస్తున్నారు. ఎందువల్లనో?

లోపాముద్ర

దేవులకే తెలియాలి.

విశ్వరథుడు

మీరు మీ జీవితపుటాశను ఇంకొకరిలో దర్శించలేదా?

లోపాముద్ర

పుత్రకా! అందరిలోనూ నాకు ఆ ఆభాస కన్పించింది. అసలువస్తువు ఇంకా ఉత్పన్నం కాలేదు.

విశ్వరథుడు

అందుకు మీకు విచారంగా లేదా?

లోపాముద్ర

విచారమెందుకు? దేవతలు నామీద దయకలిగి ఉన్నారు. వారితో కలసి తన్మయురాలను కావలెనని మాటి మాటికీ కోరుతుంటాను. ఇక నాకు విచార మెందుకు?

విశ్వరథుడు

భగవతీ! మీరు ఒకసారి నాకు దగ్గరగానూ, ఇంకొక సారి దూరాతిదూరంగానూ కనపడుతున్నారు. కాని ఈ చివరిసమయంలో ఒక్కటి యాచించదలచుకున్నాను.

లోపాముద్ర

యాచించడమా? యాచించడమేమిటి? నిన్ను ప్రసన్నుని చేయడానికి నీవు ఏది చెప్పినా చేస్తాను.

విశ్వరథుడు

అయితే నా హృదయంలో ఎంతోకాలంనుండి ఒక్క విషయం దృఢంగా ఉండిపోయింది. చెప్పమంటారా?

లోపాముద్ర

సంతోషంగా చెప్పు. ఆవిషయాన్ని బయటపెట్టకుండా నీవు సుఖపడలేవని చాలాకాలంనుండి అనుకుంటున్నాను.

విశ్వరథుడు

(సిగ్గుగా) అనుకుంటున్నారా? అయితే చెపుతున్నాను.

మీరు నాకంటే వయస్సులో పెద్దలు. తపస్వినులు. దేవత లకు ఇష్టులు. కాని (క్రిందకు చూస్తాడు.) నానోటివెంట ఆమాట రావడంలేదు. మీ సుఖంకొరకై జీవించి మీ సేవలో మరణిద్దామనుకొన్నాను... ... ...నన్ను (కిందకు చూస్తూ ఉండిపోతాడు)

లో పా ము ద్ర

(ప్రేమగా) నన్ను సిగ్గుపడేటట్లు చేయకు. నాలో ఏమున్నది ? చాలామందికి ఇలాగే ఉత్కంఠ కలిగింది. భరతశ్రేష్ఠా !—

వి శ్వ ర థు డు

(క్షమించమనే స్వరంతో) నాకు తెలుసును... ... భగవతీ !... ... ...భగవతీ !

లో పా ము ద్ర

పుత్రకా !

వి శ్వ ర థు డు

నాది ఒక ప్రార్థన. ఒక్కసారి - మృత్యువును ఆలింగనం చేసుకునేముందు - మాతృభావంతో - ఆనాడు నన్ను ముద్దుగొన్నట్టుగా ఒక్కసారి ముద్దుపెట్టుకోండి.

లో పా ము ద్ర

ఒక్కసారికాదు. వెయ్యిసార్లు ముద్దుపెట్టుకోగలను, వరుణదేవుడు, నన్ను ఆనందపరిచే పుత్రుణ్ణి నాకు ప్రసాదించాడు. (లోపాముద్ర విశ్వరథుని ముద్దుపెట్టుకుంటుంది.) వరుణదేవా! నా ప్రాణాలను హరించి నా పుత్రుణ్ణి రక్షించ గలిగితే రక్షించు. అందుకు నా ప్రాణాలను సహర్షంగా బలిచేయడానికి సిద్ధంగా ఉన్నాను.

(ఇద్దరూ కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉంటారు. తూర్పు రేకలు తెల్లవారుతవి)

విశ్వరథుడు

అదుగో వస్తున్నది నా తల్లి ఉషాదేవి. ఉషాదేవీ! నీళ్ళలోనుండి బయటికి వస్తున్న సుందరివలె-అంధకారపుసర్పాలను పారద్రోలుతూ వస్తున్నావా? దివ్యాంగనా! రా. వ్యోమద్వారాలను తెరువు. అందరినీ మేల్కొలుపు. పక్షులను ఎగరవెయ్యి. తేజోపుంజాన్ని నలువైపులా ప్రసరింపజేయి. వ్యోమపుత్రీ! తేజోమాతా! నమస్కారం.

ఋక్షుడు

(కలవరిస్తాడు) సుర! ఓ చప్పిడిముక్కుదానా! ఒక్కసారి ఇటు తే. (మేల్కొంటాడు) ఓ దేవులారా! ఇదేమిటి? (నలువైపులా చూస్తాడు) కౌశికా! మనం చచ్చిపోవలసిందే! నిజమా, అబద్ధమా? ఇది స్వప్నం కాదుగదా! (వెనుకనుండి పదధ్వని వినబడుతుంది.) ఓ తల్లిదండ్రులారా!

(భైరవుడు ఉత్సాహంతోనూ, తుగ్రుడు దైన్యభావంతోనూ ప్రవేశిస్తారు. వారివెనుక ఇద్దరు దస్యులు. ఉన్నారు. ఒకడి చేతిలో మండుతున్న దివిటీ ఉంటుంది. నలుగురూ ఉగ్రకాలునికి నమస్కరిస్తారు. భైరవుడు అట్టహాసం చేస్తాడు. కట్టెలు పేర్చినట్లు ధ్వని వినపడుతుంది)

భైరవుడు

ఉగ్రకాలుడు ఆనందంగా ఉన్నాడు. (దస్యులు గడ్డి పూలమాలలను తెచ్చి బంధితుల మెడలలో వేస్తారు, లోపా ముద్ర నవ్వుతుంది) నవ్వు వస్తున్నదా? ఇప్పుడుగూడా?

లోపాముద్ర

(తిరస్కార పూర్వకంగా) అవును. నీమీద నాకు దయ కలుగుతున్నది. మా మృత్యువువలన ఉగ్రకాలుడు ఆనందించడు.

భైరవుడు

(భయంకరంగా నవ్వుతూ) ఇప్పుడుగూడా కళ్ళలో కన్నీరులేదా! గౌరాంగినీ! ఇప్పుడే నీ గౌరవర్ణం కలిగిన-శరీరపుభస్మాన్ని లేపనంచేసి ఉగ్రకాలుని ప్రసన్నుని చేస్తాను.

లోపాముద్ర

(నవ్వి) బ్రతికిఉండగా నన్ను తాకి పశ్చాత్తాపపడ్డావు. ఇక నా భస్మాన్ని స్పృశించి భస్మ మవుతావు.

భైరవుడు

తుగ్రా! సూర్యోదయం కానున్నది. సూర్యబింబం కనపడగానే ఈమెను తగలబెట్టివేయాలి.

ఋక్షుడు

ఓః. (ఏడుస్తాడు)

తుగ్రుడు

మంచిది.

భైరవుడు

నేను ఉగ్రకాలుని ఆరాధిస్తున్నాను. ఈ—ఈ—ఈ. ఊ. (లింగం దగ్గరకు వెళ్ళి నాట్యం చేస్తాడు. సూర్యబింబం కొద్దిగా కనపడుతుంది) ఉగ్రకాలుడు ప్రసన్నుడైనాడు. సూర్య బింబం బయటకి వచ్చింది. ఈ—ఈ—ఈ. ఊ. అగ్నిని ముట్టించండి. (తుగ్రుడు రాతిమీద పెట్టిన దివిటీని తీసు కొంటాడు. రొప్పుతూ యక్షిణిలాగా ఉగ్ర ప్రవేశిస్తుంది)

ఉ గ్ర

ఈ—ఈ—ఈ. ఉః. (విశ్వరథునికి అడ్డం పడుతుంది. లోపలినుండి ఎవరినో పిలుస్తుంది) రండి. రండి. తొందరగా రండి.

తు గ్రు డు

(భయంకరంగా) దురదృష్టవంతురాలా! ఇదేమిటి?

భై ర వు డు

(ముందుకు వచ్చి) తుగ్రా! ఏమిటి చూస్తున్నావు?

అ గ స్త్యు డు

(నేపథ్యంలో) వృషభశ్రేష్ఠా! ఇంద్రా! శత్రువులను సంహారించు.

భై ర వు డు

అగస్త్యుడా!! (పారిపోతాడు)

వి శ్వ ర థు డు

(కంపిత స్వరంతో) గురుదేవా!

ఋ షు డు

ఓ గురుదేవా! రక్షించండి. రక్షించండి.

ఋ చీ కు డు

ప్రతర్దనా! బంధించు బంధించు (ఋచీకుడు వృద్ధుడు. మృగచర్మం ధరించి ఉంటాడు. చేతిలో గండ్రగొడ్డలి ఉంటుంది. తెల్లటిగడ్డం ఆయన ముఖశోభను ఇనుమడింప చేస్తున్నది. ఆయన తుగ్రుని సంహరిస్తాడు. వెనుకనుండి ప్రతర్దనుడు వచ్చి ముగ్గురిబంధనాలనూ తొలగించివేస్తాడు. దస్యులందరూ పారిపోతారు) దుష్టులారా!

(వెనుకనుండి మైత్రావరుణులు ప్రవేశిస్తారు. వారిగడ్డం నల్లగా తళతళలాడుతూఉన్నది. ఆయన కళ్ళు తేజస్సును వెళ్ళ గ్రక్కుతున్నవి. ఆయన కవచం ధరించి ఉన్నారు. ధనస్సును ఒకచేతితో ధరించి ఉన్నారు, భుజంమీద తూణీరం ఉన్నది. శిరస్సుకు శిరస్త్రాణ మున్నది.)

అ గ స్త్యు లు

పుత్రకా! విశ్వరథా! (ప్రతర్దనునితో) వెళ్లి అందరినీ సంహారించు. మన సేనలను కోటలోపల ప్రవేశపెట్టు.

(ప్రతర్దనుడు వెళ్ళిపోతాడు)

లో పా ము ద్ర

మహాఅథర్వణా! ప్రణామం.

ఋ క్షు డు

గురుదేవా! నేను ఋక్షుణ్ణి. జీవించి ఉన్నాను. నమస్కారం.

(గురువుగారు ఋక్షుని ఆలింగనం చేసుకొంటారు)

వి శ్వ ర థు డు

మహాఅథర్వణా! అభివాదనాలు. (విశ్వరథుడు ఋచీకునికి సాష్టాంగదండప్రణామం చేస్తాడు)

లో పా ము ద్ర

(అగస్త్యునివంక చూచి) మహర్షి! నా నమస్కారాన్ని స్వీకరిస్తారా?

అ గ స్త్యు లు

భారద్వాజీ! ఆశీర్వదిస్తున్నాను. నిన్ను చూచి చాలా కాలమయింది.

లోపాముద్ర

(నవ్వి) మైత్రావరుణులకు నేను కొత్తదానిని కాను. (వెనుకనుండి భయపడుతూవున్న స్త్రీల రోధనధ్వని వినపడుతుంది. దాగి పరుగెత్తుకుంటూ వచ్చి విశ్వరథుని కాళ్ళమీద పడుతుంది. ఆమె వెనుక ఖడ్గంతీసుకొని ప్రతర్దనుడు ప్రవేశిస్తాడు.)

దాగి

కౌశికా! రక్షించు, రక్షించు.

విశ్వరథుడు

ప్రతర్దనా! ఇదేమిపని?

ప్రతర్ధనుడు

గురుదేవుని ఆజ్ఞ. (అగస్త్యులు దాగిని జడ పట్టుకొని పైకి లేవనెత్తి ప్రతర్దనునికి అప్పగిస్తాడు. విశ్వరథుడు క్రోధంగా చూస్తాడు.)

అగస్త్యుడు

విశ్వరథా! నీకు తెలియదు. దస్యులనందరినీ స్త్రీ పురుషు లనక సంహరించవలసిందే! ఇది దైవాజ్ఞ.
(దాగి ఏడుస్తుంది. ప్రతర్దనుడు ఆమెను లాగుతాడు.)

విశ్వరథుడు

(క్రోధంతో) గురుదేవా! ఇలాంటి ఆజ్ఞను దస్యుల దేవతలు యివ్వవచ్చునుగాని మన దేవత లివ్వరు.

అగస్త్యుడు

నీవు సరిగా తెలివిలో లేవు. ఇవన్నీ తరువాత మాట్లాడుకుందాము. ప్రతర్దనా! నీ పనికానీ!

ప్రతర్దనుడు దాగిని లాగుకొని పోతాడు. అగస్త్యుడు గూడా లోపలికి వెళ్ళిపోతాడు. శంబరి స్మృతితప్పి పడిపోతుంది.)

విశ్వరథుడు

(వ్యాకులభావంతో) దస్యుసంహారమా! (ఉగ్రి దగ్గరకు వెళ్ళి చూస్తాడు.

లోపాముద్ర ఉగ్రకు శీతలోపచారాలు చేస్తుంది) మూర్ఛ బోయింది.

లోపాముద్ర

మహా అథర్వణా! మీరుగూడా ఈ యుద్ధంలో వచ్చారా?

ఋచీకుడు

శంబరుడు నిన్ను హరించా డనగానే నా రక్తం ఉడుకెక్కింది. క్షణంలో అందరమూ వచ్చాము. దివోదాసు గూడా వచ్చాడు.

లోపాముద్ర

అవును. తప్పక వస్తారు. మీకందరికీ నామీద అమిత దయ.

(లోపలినుండి చనిపోతున్న దస్యులరోదనధ్వని వినపడుతుంది)

విశ్వరథుడు

(ఉగ్రంగా) మహా అథర్వణా! అదేమిపని? (పెదిమలు కొరికి) ఆ పనిని ఆపించండి.

ఋచీకుడు

విశ్వరథా! మూర్ఖుడవు కాబోకు. లోపాముద్రను హరించినవారికి జరుగగల శాస్తి ఇంతే.

విశ్వరథుడు

కాని వారు స్త్రీలు గదా ?

ఋచీకుడు

(నవ్వి) ఇంద్రుడు కోపగిస్తే ఎవ్వరేమి చేయగలరు ?

విశ్వరథుడు

భగవతీ ! శాంబరి కళ్లు తెరువలేదే ! !

లోపాముద్ర

(పమిటచెంగుతో విసరుతూ) ఇప్పుడే కళ్ళు తెరుస్తుంది.

ఋచీకుడు

ఈ అమ్మాయి సరియైన సమయానికి వచ్చింది. లేక పోతే కోటనుజయించడం దుర్ఘటమయ్యేది.

లోపాముద్ర

మేము భస్మమైపోయేవారం

విశ్వరథుడు

(చకితుడై) శాంబరి మిమ్మల్ని ఇక్కడకు తీసుకొని వచ్చిందా ?

ఋచీకుడు

(నవ్వి) దస్యుకన్యకగదా ? తన తండ్రిదుర్గాన్ని తన చేతులతో మాకు అప్పగించింది,

లోపాముద్ర

మహా అథర్వణా! ఈమె కౌశికుని భార్య. తన భర్తను రక్షించుకోడానికి ఈమె తన తండ్రికి ఆపద కలుగజేసుకొన్నది.

ఋచీకుడు

కౌశికునిభార్యయా ఈ దాసి?

విశ్వరథుడు

ఈమె రాజకుమారి.

ఋచీకుడు

ఒకప్పుడు. ఇప్పుడుకాదు.

ఉగ్ర

(స్మృతి తెలిసి) కౌశికా! (లోపాముద్రను ఆలింగనం చేసుకొని) గౌరాంగీ! నా కౌశికు డెక్కడ? (చూచి) ఉగ్రకాలుడు ప్రసన్నుడైనాడు.

(నేపథ్యంలో దస్యుస్త్రీల రోదన ధ్వని)

ఉగ్ర

(భయపడి లేచి కూర్చుంటుంది) అదిగో, మాఅమ్మ కంఠధ్వని (లేచి నిలబడబోతుంది)

విశ్వరథుడు

నీవు కూర్చో. నేను వెళ్ళుతాను (వెళ్ళబోతాడు)

ఋచీకుడు

(విశ్వరథుని ఆపి) జాగ్రత్త. మధ్యలో నీవు అడుపడ గూడదు. (నేపథ్యంలో దస్యుగణం రోదనధ్వని)

ఉగ్ర

కౌశికా! మాఅమ్మను రక్షించు. (ఏడుస్తుంది)

(నేపథ్యంలో) ఆర్యులు.

భరతశ్రేష్ఠుడగు కౌశికునకు జయ్.

విశ్వరథుడు

మా భరతులచేతిత్తో ఇలాంటి దుష్కృత్యాన్ని చేయిస్తున్నారా?

ఋచీకుడు

(కఠోరంగా) నీ విక్కడే ఉండాలి. నా ఆజ్ఞలేనిది కదలకూడదు.

లోపాముద్ర

మహాఅథర్వణా! ఈ శాంబరిని ఇంకొకచోటికి తీసుకొని పోవాలి.

ఋచీకుడు

ఇప్పుడే పంపుతాము. (పాదధ్వని వినపడుతుంది. ఖడ్గహస్తుడై ప్రతర్దనుడు ప్రవేశిస్తాడు)

ప్రతర్దనుడు

దివోదాసు శంబరుని బంధించాడు. ఇక్కడకు తీసుకొని వస్తున్నాడు.

ఉగ్ర

(రొమ్ములు బాదుకొని ఏడుస్తుంది) శంబరునా? నా తండ్రిని? కౌశికా! నా తండ్రిని రక్షించు.

విశ్వరథుడు

నేను వెళ్ళుతున్నాను. (వెళ్ళిపోతాడు)

ఋచీకుడు

ప్రతర్దనా! కౌశికునితో నీవుగూడా పో. అతని ప్రాణాలు ఇంకా సురక్షితం కాలేదు.

ప్రతర్దనుడు

చిత్తం (వెళ్ళిపోతాడు)

ఉగ్ర

(ఏడుస్తూ) లోపాముద్రా ! నా తండ్రిని చంపివేస్తారా?

లోపాముద్ర

లేదు. వదలివేస్తారు.

ఉగ్ర

నా విశ్వరథునికి ఏమీ అపకారం జరగదు గదా?

ఋచీకుడు

పిచ్చిదానిలాగా ఉన్నది.

లోపాముద్ర

మహాఅథర్వణా! దుఃఖంలో ఉన్నదని ఎగతాళి చేయబోకండి. ఆమెను దయగా చూడండి. మీ సప్తసింధు నంతనూ, ఎన్ని పర్యాయాలు గాలించినా ఇలాంటి సరళహృదయురాలు ఒక్కతెకూడా దొరకదు. (ఉగ్రతో) అమ్మా! ఏమీ జరగదు. భయపడకు. (తనవొడిలో ఉగ్రను పడుకోబెట్టుకుంటుంది.) మహాఅథర్వణా! వరుణరాజు ఎలా నవ్వుతున్నాడో చూడు. (కొంచెంసేపు సూర్యునివంక చూచి) వరుణదేవుని మహాలోచనం తెరువుడుపడింది. భార్గవా! వరుణునకు అన్నివిషయాలూ తెలుసును. వరుణదేవా! ఏమి నీ మహిమ! ఓ ద్యావాపృథివీనాథా! ఏమి నీ ప్రకాశం!!

ఋక్షుడు

భగవతీ! మీరు వరుణునితో మాట్లాడేటప్పుడు ఎంతో అందంగా కనపడతారు.

లోపాముద్ర

ఋక్షా! మాట్లాడకు.

(నేపథ్యంలోనుండి శంబరుడు)

ఉగ్రకాలునకు జయ్.

ఉ గ్ర

నా తండ్రి. (లేచి నిలబడబోతుంది.)

(నేపథ్యంలో) అగస్త్యుడు.

దస్యులను సంహరించండి.

(నేపథ్యంలో రోదనధ్వని వినపడుతుంది.)

(ఉగ్ర తిరిగి మూర్ఛితురా లవుతుంది.)

లో పా ము ద్ర

మహాఅథర్వణా! అగస్త్యులవారింత యోధులని నాకు తెలియదు. (ఉగ్రవంకచూచి) ఉగ్ర మళ్ళీ మూర్ఛబోయింది.)

(ఉత్తరీయం చెంగుతో విసరుతుంది.)

ఋ చీ క డు

లోపాముద్రా! అగస్త్యునిలాంటి తేజోవంతుడైన తపోనిష్ఠాగరిష్ఠుని ఇంతవరకు చూడలేదు. దేవతలకు ఆయనంటే చాలాప్రేమ.

లో పా ము ద్ర

కాని దస్యులంటే ఆయనకు మహాద్వేషం.

ఋ చీ క డు

ఇలాంటి దుష్టులకు శాస్తి కావలసిందే. మిమ్మల్ని బలిచేయ బోతున్నారా? వీళ్ళ దేవతలుకూడా మహాదుష్టులు.

లో పా ము ద్ర

విశ్వరథునిమాట అసత్యం కాదు. వీరి దేవతలూ మన దేవతలూ అందరూ సంహారానికే ఆజ్ఞయిస్తే ఇద్దరిలోఉన్న భేద మేమిటి?

(నేపథ్యంలో) దివోదాసు

మైత్రావరుణులను పిలవండి.

(దివోదాస అతిథిగ్వుడు ప్రవేశిస్తాడు. విశాలమైన వక్షం. ఆయన కవచాన్నీ, శిరస్త్రాణాన్నీ ధరించి ఉన్నాడు. చేతిలో మాల ఉన్నది. గాయపడిన శంబరుని తాళ్ళతో కట్టి నలుగురు ఆర్యులు తీసుకొని వస్తారు. అతడు నల్లగా ఉన్నాడు. కవచం ధరించి ఉన్నాడు. అతని శిరస్సునుండి రక్తం ప్రవహిస్తున్నది. కళ్లు ఎర్రగా ఉన్నవి. శంబరుడు నిలవలేక పడిపోతాడు. ఆతనిశక్తి అంతకంతకు క్షీణించి పోతున్నది)

దివోదాసు

మహాఅథర్వణా! చివరకు ఈ దుష్టుడు బంధింపబడ్డాడు. (లోపాముద్రను సమీపించి) లోపాముద్రా! ఎలా ఉన్నావు?

లోపాముద్ర

(నవ్వి) మీ రందరూ దయచేశారు. అందువలననే నేను జీవించ గలిగాను.

దివోదాసు

మా భారద్వాజికి దుఃఖం కలగజేసినవాడికి ఇదేగతి లభిస్తుంది. చివరకు దుష్టుడు బంధించబడ్డాడు.

ఋచీకుడు

అతిథిగ్వా! శతమన్యుని చివరకు ప్రసన్నుని చేయ గలిగినావు.

(ఉగ్రకు స్మృతి తెలిసి పిచ్చిదానిలాగా శంబరునిదగ్గరకు చేరుతుంది)

ఉగ్ర

పితాజీ! పితాజీ!

లోపాముద్ర

అమ్మాయీ! భయపడకు. శంబరునికి నేను సపర్య చేస్తాను.

ఉగ్ర

లోపాముద్రా! నా తండ్రిని ఆరోగ్యవంతుణ్ణిగా చేయి. మీ దేవతలు నా తండ్రికి ప్రాణదానం చేస్తారు.

లోపాముద్ర

భయపడకమ్మా!

(లోపాముద్ర శంబరునిశరీరంమీది రక్తం తుడుస్తుంది. మంత్రాలు చదువుతుంది. అగస్త్యులు ఉత్సాహంగా వచ్చి మంత్రాలు చదువుతున్న లోపాముద్రను చూస్తారు, మండి పోతారు.)

అగస్త్యులు

భారద్వాజీ! ఏమిటి ఆ పని?

లోపాముద్ర

(గంభీరంగా) అశ్వనీదేవతలను ఆహ్వానిస్తున్నాను. మరణించేవానిని రక్షిస్తున్నాను.

అగస్త్యులు

మంత్రవిద్య ఋషులకు సంబంధించినది. అసురులకై దానిని ఉపయోగించకూడదు.

దివోదాసు

లోపాముద్రా! ఇతనిని బ్రతికించగూడదు.

లోపాముద్ర

(గౌరవంగా కళ్లు ఎత్తి) ఇతడు దాసవుడు. కాని

దయార్ద్రహృదయుడు. వృద్ధుడు. ఇతడు మమ్ము బ్రతికించాడు. ఇతనికుమార్తె చెరనుండి మమ్ము విడిపించింది.

అగస్త్యుడు

(తిరస్కారపూర్వకంగా) వేలకొలది ఆర్యులరక్తంతో ఇతని చేతులు ఎర్రబడినవి. వేలకొలది ధేనువులమాంసంతో ఈతని శరీరం పుష్టమయింది.

ఉగ్ర

(లోపాముద్ర చెయిపట్టుకొని ప్రార్థిస్తుంది) గౌరాంగీ! ఈ దుష్టుని బారినుండి నా తండ్రిని రక్షించు.

అగస్త్యుడు

ఇతడు అంధార దేశయాత్ర చేయదగినవాడు.

లోపాముద్ర

అగస్త్యమహామునీ! మనమే ఇంత దయావిహీనులమై పోతే దానవులకూ మనకూ భేద మేముంటుంది?

దివోదాసు

లోపాముద్రా! ఇతడు మరణించ వలసిందే.

అగస్త్యుడు

భారద్వాజీ! (మండేకళ్ళతో) అగ్నిదేవుని మీద...

ఋచీకుడు

(భయంకరమైన కళ్ళతో అగస్త్యునిచేయి పట్టుకుంటాడు) మైత్రావరుణా! ఆగు.

(క్షణకాలం ఋచీక మైత్రావరుణులు ఒకరినొకరు చూచుకుంటారు. అగస్త్యుడు శపథమూనడం మానివేస్తాడు.)

శంబరుడు

అబ్బా! అబ్బా!!

దివోదాసు

(దగ్గరకు వెళ్ళి) శంబరుడు కదులుతున్నాడు.

(అందరూ చూస్తూఉంటారు. శంబరుడు లేచి కూర్చుంటాడు. ద్వేషపూరితంగా దివోదాసువంక చూస్తాడు)

శంబరుడు

(కుంఠిత స్వరంతో) ఎవరు ?... దివోదాసుడా ? చివరకు నీవు జయించావు. దుష్టుడా ! నా వెంటబడ్డావు. (ఉగ్రకాలునివంక చూచి) ఓ పశుపతీ! నే నెక్కడున్నాను ? ఉగ్రకాల భైరవనాథా ! (తలవొంచి) నా కోట పడిపోయింది. నా ప్రజలు...... (పళ్ళుకొరికి) పాపీ ! మా పశుపతి నిన్ను సర్వనాశనం చేస్తాడు. (తలవొంచుకొంటాడు)

ఉగ్ర

పితాజీ ! పితాజీ ! (తండ్రిని పట్టుకొంటుంది.)

లోపాముద్ర

శంబరా ! శాంతించు.

శంబరుడు

(శాంబరివంక తీవ్రంగా చూస్తాడు) ఎవరు ? ఉగ్రీ ! దుష్టురాలా ! భర్తను రక్షించుకోడానికి శత్రువును కోటలోనికి పిలుచుకొని వచ్చావా? తల్లి దండ్రులను మింగి కూర్చున్నావా ? ప్రజలను నాశనం చేయించావా ?

అగస్త్యుడు

(తిరస్కారపూర్వకంగా) మృత్యుద్వారందగ్గర నిలబడ్డా ఇతనికి మంచిబుద్ధి కలుగలేదు.

శంబరుడు

(పళ్ళుకొరికి) పో. దుష్టురాలా ! ఆనందించు. తల్లి

దం|డుల-బంధువుల శవాల మీాద నిలబడి తాండవనృత్యం చేయి___పో___

ఉ|గ

పితాజీ! (వెక్కి వెక్కి ఏడుస్తుంది)

లో పా ము|ద

శంబరా! ఏమిటి ఆమాటలు?

(తొందరగా, పెద్దగా) కులకళంకినీ! పశుపతి కాల సర్పాలచే నిన్ను కరిపించుగాక. వెళ్ళు. నీభర్తవాళ్లో కూర్చో. ఆనందించు. నీపేరు వ్యాపించినచోటనల్లా విషజ్వాలలు |పజ్వరిల్లుగాక. (లేవబోతాడు)

ఉ|గ

పితాజీ! పితాజీ! (పెద్దగా ఏడుస్తుంది.)

లో పా ము|ద

(శంబరునితలమీాద చెయి బెడుతుంది) సోదరుడా! శాంతించు. అలాంటిమాటలు మాట్లాడకు. (శంబరునికి నీళ్ళు తాగిస్తుంది)

శ ం బ రు డు

(లోపాము|దను చూస్తాడు) ఎవరు? లోపాము|దా? (అతనికళ్లలో అశ్రుతం నిండుతుంది.)

లో పా ము|ద

శంబరా! నీవు వీరుడవు, బలవంతుడవు. నీకు జయించడమూ తెలుసు, ఓడటమూ తెలుసు. ఏమిటి ఆ మాటలు?

అ గ స్త్యు డు

(తీ|వంగా) ఇక చాలు. చాలించు.

లోపాముద్ర

(కఠోరంగా అగస్త్యునితో) ఉండు. (శంబరునితో నెమ్మదిగా) దస్యునాథా! చంచలుడవు కాబోకు. (శంబరుని తల నిమురుతుంది)

ఉగ్ర

పితాజీ! (ఏడుస్తుంది)

లోపాముద్ర

శంబరా!

అగస్త్యుడు

ఇక మనం వెళ్లిపోవాలి.

దివోదాసు

లోపాముద్ర అడ్డుతున్నది.

శంబరుడు

(భావపూరిత నేత్రాలతో లోపాముద్రను చూచి) లోపా...ముద్రా! (భయపడతాడు) ఓఫ్!... నన్ను ఉగ్రకాలుడు పిలుస్తున్నాడు— ఉగ్రకాలుడు... పశుపతీ! వీరినందరినీ సంహరించు.

అగస్త్యుడు

ఈ లింగమేనా మీ దేవుడు? (అగస్త్యుడు లింగం వంక చెయి జూపించి నవ్వుతాడు)

శంబరుడు

(బలవంతంగా స్మృతి తెచ్చుకుంటూ) ఈ లింగమే మా దేవత, అగస్త్యా! ఇది మీ భూమి కాదు, మీ దేవతల భూమి కాదు. మీరూ, మీ దేవతలూ అందరూ నశిస్తారు. సూర్యుడు ప్రకాశించే చోటనల్లా మా పశుపతియే రాజ్యం

చేస్తాడు (శంబరునికళ్లలోని ఆవేశం తగ్గిపోతుంది. లోపాముద్ర వంక చూస్తాడు) లోపాముద్రా! ఈ దుష్టులు బ్రతికి నంతకాలమూ నన్ను... వేధించారు. కేవలం నీవ్వమాత్రం...

ఉగ్ర

(ఏడుస్తూ) పితాజీ!

శంబరుడు

లో...పా...(స్వరం రుద్ధ మవుతుంది. శిరస్సుమీాదకు వాలుస్తాడు. శంబరుడురు ప్రాణాలు విడుస్తాడు)

ఉగ్ర

పితాజీ! పితాజీ! (పెద్దగా ఏడుస్తుంది.)

లోపాముద్ర

(నిలబడి) ఇతడు దస్యుడయినా ఇతని హృదయం కాంచనంతో సమానం.

అగస్త్యుడు

(దివోదాసునితో) రాజన్! నా తపస్సు సఫల మయింది.

దివోదాసు

శంబరుడు మహాపరాక్రమవంతుడు? ఇంద్రా! నేను మీా కృపకు పాత్రుడనైనాను. సేన వచ్చిందా? రాలేదా? (బయట సైనికుల కోలాహలం వినపడుతుంది)

ఋచీకుడు

నా సైనికులుగూడా వచ్చి ఉంటారు.

దివోదాసు

గురువర్యా! తృత్సుసేన వచ్చింది. దుర్గం మన అధికారంలోనికి వచ్చిందో లేదో చూచి వస్తాను.

అగస్త్యుడు

ఉన్మత్తత కలిగినదా? (విశ్వరథుని తొలగించబోతాడు)

విశ్వరథుడు

(భయంకరంగా) గురుదేవా! మీకు నేను అపకారం చేయలేను. మీరు నా ప్రాణాలను హరించండి. ఈ ఉగ్ర నన్ను ఉగ్రకాలునికి బలిగాకుండా రక్షించింది. ఉగ్రమూర్తీ! ఈ నిర్దోషురాలిని సంహరించడానికిముందు నన్ను మీ ఖడ్గానికి ఎరగా స్వీకరించండి. నేను శంబరకన్యభర్తను. శంబరకన్య నా ధర్మపత్ని. (తల వొంచుతాడు.)

అగస్త్యుడు

(పళ్ళుకొరికి ఖడ్గంఎత్తి) నాకు ఎదురుచెప్పుతున్నావా?

లోపాముద్ర

(అగస్త్య విశ్వరథులమధ్య నిలబడుతుంది.) మైత్రా వరుణా! ఇదేమిపని? ఈమె దుఃఖాశ్రువులుసైతము నీ క్రోధాగ్నిని చల్లార్పలేక పోతున్నవి!! (అగస్త్యుడు ఖడ్గాన్ని దించివేస్తాడు.)

లోపాముద్ర

పుత్రునీ, పుత్రవధువునూ ఒక్కసారిగానే సంహరించ దలచారా?

అగస్త్యుడు

నీవు గూడా... ... ...

లోపాముద్ర

అవును. నేను గూడా... ... ...

(అగస్త్యుని చేతినుండి ఖడ్గం క్రింద పడిపోతుంది.)

(తెరపడుతుంది)*

---

* తరువాత కథను దేవదత్తనాటకంలో చదవండి.